# జాతకచంద్రిక

(జాతకచంద్రిక, గోపాలరత్నాకరము, జాతకకళానిధి.)



మూడవ కూర్పు 1000 ప్రతులు.





పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు,

శ్రీసత్యనారాయణ బుక్కుడిపో,

రాజమండ్రి.

1941



[వెల రు 0—౮—0

# జాతక చంద్రిక.



శ్లో. సిద్ధాంత మహోపనిషదం సిద్ధాంతం పరమేష్ఠినః,
శోణాధరం మహత్కించిద్వీణాధర ముపాస్మహే. 1

తా. వే నుపనిషత్సంబంధమైనటువంటిదియు నిశ్చయమైనటువం టిదియు, వీణనుధరించునదియు, యెఱ్ఱనైన అధరబింబము కలదియును అగు నొక సరస్వతీరూపతేజమును ధ్యానముచేయుచున్నాను.

శ్లో. ఫలాని నక్షత్రదశాప్రకారణే వివృణ్మహే
వయం పారాశరీం హోరా మనుసృత్యయధామతి. 2

తా. మేము నక్షత్రదశాక్రమమున పూర్వీకుల ననుసరించి మణీంథయవనాచార్య మతానుసారముగ పారాశర్యహోరను తెలియ జేయుచున్నాము.

శ్లో. బుధై ర్భావదయ స్సర్వే జ్ఞేయా స్సామాన్యశాస్త్రతః
ఏతచ్ఛాస్త్రానుసారేణ సంజ్ఞాం బ్రూమో విశేషతః. 3

తా. పెద్దలచే సమస్తవిషయములను, (నక్షత్రములు, లగ్న ములు, గ్రహములు మొదలగు ప్రారంభవిషయములను) దెలియవల యును. ఇపుడు మేము యీశాస్త్రమున విశేషములైన శాస్త్రసంకేత ములను జెప్పుచున్నాము.

శ్లో. పశ్యంతి సప్తమా స్సర్వే శనిజీవకుజాఃపునః
విశేషతశ్చ త్రిదశత్రికోణచతురస్రగాన్. 4

తా. సూర్యాది నవగ్రహములును తామున్న స్థలము లగాయతు యేడవరాశిని జూచుచుందురు. అదనముగా శని 3, 10 స్థానములను గురుఁడు 5, 9 స్థానములను, కుజుఁడు 4, 8 స్థానములను కూడ జూచు

చుందురు. అనగా శని తానున్న స్థానమున కేడవరాశిని; మూడవరాశిని పదవరాశిని గూడ జూచువాడగును. ఇట్లే కుజగురులకుగూడ తెలియ వలయును.

శ్లో. సర్వేత్రికోణనేతారో గ్రహాశ్శుభఫలప్రదాః
పతయ స్త్రిషడాయానాం యది పాపఫలప్రదాః. 5

తా. నవగ్రహములలో రాహుకేతువులకు ఆధిత్యము ప్రత్యే కముగా నిర్దేశింపబడలేదు. తక్కిన 7 గ్రహములలో నేగ్రహములకైన 5, 9 స్థానముల కాధిపత్యము వచ్చినయెడల వారు సహజముగా పాపు లైనను శుభఫలమునే యిత్తురు. 3, 4 స్థానములకు అధిపతులైన గ్రహ ములు పాపఫల మొసంగును.

శ్లో. న దిశంతి శుభం నృణాంసౌమ్యాః కేంద్రాధిపా యది
క్రూరాశ్చేదశుభం త్వేతా ప్రబలా ఉత్తరోత్తరం. 6

తా. సౌమ్యులకు కేంద్రాధిపత్యము గలుగుటవలన పాపులగు దురు. అనగా పాపఫల మిచ్చువా రగుదురు. క్రూరగ్రహములు కేంద్రా ధిపతులైనచో శుభఫలము నిచ్చెదరు. గురు శుక్ర బుధ చంద్రులు సౌమ్యులు, రవి కుజ శనులు పాపులు.

ఈశ్లోకమున ప్రబలాఉత్తరోత్తరం అని ప్రయోగించుటచేతను లగ్నకేంద్రాధిపతికంటె చతుర్థకేంద్రాధిపతియు, వానికంటె సప్తమ కేంద్రాధిపతియు, వానికంటె దశమకేంద్రాధిపతియు; పంచమకోణాధి పతికంటె నవమకోణాధిపతియు; తృతీయాధిపతికంటె షష్ఠాధిపతియు, వానికంటె లాభాధిపతియు; నెక్కుడు శుభపాపఫలంబుల నీయుదురని తలంపవలసి యున్నది.

శ్లో. లగ్నాద్వ్యయ ద్వితీయేశౌ పరేషాం సాహచర్యతః
స్థానాంతరానుగుణ్యేన భవతః ఫలదాయకౌ, 7

తా. ద్వితీయవ్యయాధిపతులు యితరులతో కలియుట లేక యిత రాధిపత్యములు కల్గియుండుట ముఖ్యగువాని ననుసరించి ఫలముల నొసం గుచుందురు. ఇతరాధిపత్యములు లేనియెడల వారు స్వక్షేత్రములందుం డినయెడల శుభపాపఫలముల నీయజాలరు. ఈవిషయమును రూఢిచేయు టకు మిధున కర్కాటక లగ్నములకు ద్వితీయాధిపతులైన చంద్ర సూ ర్యులు స్వక్షేత్రమునందుండినయెడల మారకము నీయజాలరని మున్ముందు నుడివియుండుటయే నిదర్శనమై యున్నది. చూ. 49. 52 శ్లోకములు.

శ్లో. భాగ్యవ్యయాధిపత్యేన రంధ్రేశో న శుభప్రదః
సఏవ శుభసంధాతా లగ్నాధీశోపిచేత్స్వయం॥ 8

తా. అష్టమము భాగ్యస్థానమునకు వ్యయస్థానమగుటచే అష్ట మాధిపతి పాపఫలమిచ్చును. కాని యీఅష్టమాధిపతికే లగ్నాధిపత్యము కూడ గలిగెనేని శుభప్రదుఁడగును. ఏలననగా; లగ్నము భాగ్యమునకు పంచమమైనది. లగ్నాత్ పంచమవ్యయాధిపతి పాపికాడని ముందు రాగల శ్లోకములలో జెప్పబడియుండుటచే భాగ్యాపేక్షచే పంచమవ్యయాధిపతి యైన లగ్నాష్టమాధిపతియు పాపికాడు.

లగ్నాష్టమాధిపత్యములు మేషతులాలగ్నములకు మాత్రమే కలుగును. మేషలగ్నమున కుజునకును, తులాలగ్నమున శుక్రునకు గలుగు చుండును.

అథ త్రిభిఃశ్లోకై ర్గ్రహానుద్దిశ్య సౌమ్యకేంద్రత్వక్రూర కేంద్రత్వ
రంధ్రాధిపతిత్వప్రయుక్తగుణదోషా విలిఖ్యంతే॥

శ్లో. కేంద్రాధిపత్యదోషస్తు బలవాన్ గురుశుక్రయోః
మారకత్వేపిచ తయో ర్మారకస్థానసంస్థితిః. 10

తా. సౌమ్యులగువారిలో గురుశుక్రులకు కేంద్రాధిపత్యదోష మెక్కుడగునది. అట్టికేంద్రాధిపత్యములు కలిగి వీరు మారకస్థానముల లోనున్న మారకము నిచ్చుటలోగూడ బలవంతులు.

శ్లో. బుధ స్తదను చంద్రోపి భవే త్తదను తద్విధః
నరంధ్రేశత్వ దోషస్తు సూర్యచంద్రమసోభవేత్. 11

తా. కేంద్రాధిపత్యదోషము గురుశుక్రులకంటె బుధునకు తక్కువ, బుధునికంటెను చంద్రునకు తక్కువ. మఱియు సూర్యచంద్రుల కష్టమాధిపత్యదోషములేదు.

శ్లో. కుజస్య కర్మనేతృత్వప్రయుక్తశుభకారితా
త్రికోణస్యాపినేతృత్వే నకర్మేశత్వమాత్రతః. 12

తా. కుజునకు దశమాధిపత్యమును పంచమాధిపత్యమును కలిగినయెడల శుభుఁడగును కాని కేవలము కర్మాధిపత్యముమాత్రమే కల్గి తృతీయాధిపత్యమున కుజుడు పాపి. కావుననే కుజుఁడు కర్కాటకలగ్న జాతకులకు శుభుడు. కుంభలగ్నజాతకులకు కుజుడు శుభప్రదుడుకాడు.

శ్లో. యద్యద్భావగతావాపి యద్యద్భావేశసంయుతౌ
తత్తత్ఫలాని ప్రబలౌ ప్రదిశేతాం తమోగ్రహౌ. 13

తా. రాహుకేతువులకు ఆధిపత్యములులేవు. వారు యేస్థానముల యందుందురో, యేభావాధిపతులతో గలసియుందురో, యేస్థానాధిపతులచే జూడబడుదురో బలవంతులైన యాయాగ్రహములయొక్క బలమునుబట్టి ఫలముల నొసంగుచుందురు. అనగా శుభస్థానములనుండుట శుభులతో సంపర్కము గలిగియుండుటవలన శుభఫలమును, పాపస్థానములనుండుట పాపులసంపర్కమువలన పాపఫలమును యిచ్చెదరు. వారు సంబంధము, సాహచర్యము, వీక్షణముగల్గిన గ్రహములలో నెవ్వ డెక్కుడుబలవంతుడో వానిఫల మొసంగుచుందురు.

## సామాన్యములగు శుభయోగములు.

శ్లో. కేంద్రత్రికోణపతయ స్సంబంధేన పరస్పరం
ఇతరైరప్రసక్తాశ్చేద్విశేషశుభదాయకాః,

తా. కేంద్రకోణాధిపతులకు ఒకరితోనొకరు కలియుట, ఒకరి నొకరుచూచుట, గలిగి యితరులతో సంపర్కము లేనియెడల అధికమగు శుభఫలము నొసంగుదురు. ఇతరులసంపర్కమనగా 3, 6, 11 అధిపతులతో గలియుటగాని, వారిచే చూడబడుటగాని యని యభిప్రాయము. మరియు నట్టికేంద్రకోణాధిపతులకు పైనజెప్పిన 3, 6, 11 ఆధిపత్యములు కూడియున్నను లేక నట్టిపాపాధిపత్యములు గల్గిన యితరగ్రహములు వారితో గలియుట మున్నగునవి లేకుండనున్న అధికముగా శుభఫలమొసంగుదురు. అట్టిసంబంధమున్న సామాన్యఫలమొసంగుదురనియు గ్రహింపవలయును.

రాజయోగములు.

శ్లో. కేంద్రత్రికోణనేతారౌ దోషయుక్తావపిస్వయం
సంబంధమాత్రాద్బలినౌ భవేతాం యోగకారకౌ. 15

తా. బలవంతులగు కేంద్రకోణాధిపతులు(భాగ్యరాజ్యాధిపతులు) తాము స్వభావసిద్ధముగా దోషముగలవారైనను, (వారి కితరపాపాధిపత్యములున్నను) సంబంధము గల్గియున్నమాత్రమున రాజయోగము నిచ్చువా రగుదురు. పైనజెప్పిన శ్లోకమునకు భిన్నముగా నియ్యది చెప్పబడినను విశేషవిధియని తలంపవలయును. ఇందు బలవంతులైన కేంద్రకోణాధిపతులనగా ప్రబలా ఉత్తరోత్తరం అనుటచే భాగ్యరాజ్యాధిపతుల సంబంధమే యని నిశ్చయింపవలయును.

శ్లో. నివసేతాం వ్యత్యయేన తావుభౌ ధర్మకర్మణోః
ఏకత్రాన్యతరోవాపి వసేచ్చే ద్యోగకారకౌ. 16

తా. ధర్మకర్మాధిపతులు ఒకరియింట నొకరు పరివర్తనగా యున్నను, భాగ్యాధిపతి రాజ్యమందుగాని, రాజ్యాధిపతి భాగ్యమందుగాని యున్నను రాజయోగము నిచ్చువా రగుదురు. భాగ్యరాజ్యాధి

పతులు యిరువురును పరివర్తనగానుండినయెడల నిరువురును, ఒకరు పరివర్తనగాయున్న నొక్కడును రాజయోగము నిచ్చువా డగును.

శ్లో. త్రికోణాధిపయోర్మధ్యే సంబంధోయేన కేనచిత్
కేంద్రాధిపస్య బలినో భవేద్యది సయోగకృత్ 17

తా. బలవంతుండైన కేంద్రాధిపతికి అనగా ప్రబలా ఉత్తరోత్తరం అను న్యాయముచే దశమాధిపతికి పంచమ నవమాధిపతులతో సంబంధముగల్గినయెడల నట్టి కేంద్రాధిపతి రాజయోగము నిచ్చువా డగును.

శ్లో. దశాస్వపి భవేద్యోగః ప్రాయశోయోగకారిణోః
దశాద్వయీ మధ్యగతో తదయుక్శుభకారిణామ్. 18

తా. రాజయోగకారక గ్రహములయొక్క రెండుదశలకును మధ్యనున్న రాజయోగకారకగ్రహములతో సంబంధములేని శుభగ్రహములయొక్క దశయందుగూడ తరచుగా రాజయోగము గలుగుచుండును.

శ్లో. యోగకారకసంబంధాః పాపినోపిగ్రహాః స్వతః
తత్తద్భుక్త్యనుసారేణ దిశేయు ర్యోగికంఫలం. 19

తా. గ్రహములు స్వభావసిద్ధముగా పాపులైనను (3, 6, 11 స్థానాధిపత్యములు గల్గియున్నను) రాజయోగమునిచ్చు గ్రహములయొక్క సంబంధముచేత ననగా కలసియుండుటగాని యాగ్రహములచే చూడబడుటగాని యున్నయెడల ఆ భుక్తుల ననుసరించి యట్టిపాప గ్రహములును తమ తమ దశలు నడచు నపుడు రాజయోగఫల మొసంగుదురు.

శ్లో. యాదికేంద్రే త్రికోణేవా నివసేతాం తమోగ్రహౌ
నాథేనాన్యతరస్యైవ సంబంధాద్యోకారకౌ. 20

తా. రాహుకేతువులు కేంద్రములగాని కోణములగాని యుండగా కేంద్రములయందుండువారికి కోణాధిపతులయొక్కయు కోణమం

దుండు గ్రహములకు కేంద్రాధిపతులయొక్కయు సంబంధము కలిగెనేని అట్టియెడ రాహుకేతువులు యోగకారకులగుచుందురు.

శ్లో. కేంద్ర త్రికోణాధిప యోరైక్యే తే యోగకారకాః
అన్యత్రికోణపతినాసంబంధోయది కింఫలమ్. 21

తా. కేంద్రకోణాధిపత్యములు రెండును ఒకే గ్రహమునకు గల్గియున్న నాగ్రహము రాజయోగము నిచ్చును. అట్టి గ్రహమునకు రెండవ కోణాధిపతి సంబంధముకూడ గలిగినయెడల నిక చెప్పవలసినదేమున్నది. తప్పక రాజయోగము కలుగును.

రాజయోగభంగము.

శ్లో. ధర్మకర్మాధినేతారౌ రంధ్రలాభాధిపౌయది
తయోస్సంబంధమాత్రేణ నయోగం లభతేనరః. 22

తా. భాగ్యరాజ్యాధిపతులలో నెవరికైనను అష్టమలాభాధిపత్యములుగాని అష్టమరాజ్యాధిపత్యములుగాని గలిగెనేని అట్టి భాగ్యాధిపరాజ్యాధిపతులకు సంబంధముగాని వీక్షణముగాని యున్నయెడల రాజయోగము గలుగదు.

ఆయుర్దాయవిషయము.

శ్లో. అష్టమం హ్యాయుషస్థాన మష్టమా దష్టమంచతత్
తయోరపి వ్యయస్థానం మారకస్థాన ముచ్యతే. 23

తా. లగ్నమున కష్టమమును, అష్టమమున కష్టమమగు తృతీయమును ఆయుర్దాయస్థానములు. ఈ రెండింటికిని వ్యయస్థానములగు 7, 2 స్థానములు మారకస్థానములనియు దలంపవలయును.

శ్లో. తత్రాప్యాద్యవ్యయస్థానా దుత్తరం బలవత్తరం
తదీశతు స్తత్రగతాః పాపిన స్తేన సంయుతాః. 24

తా. పైనజెప్పిన ద్వితీయసప్తమస్థానములలో సప్తమముకంటె ద్వితీయము బలమైనది. మరియు నాస్థానాధిపతులకంటె సప్తమద్వితీయ

ములనుండు గ్రహములును, సప్తమ ద్వితీయాధిపతులతో గలసియుండు గ్రహములును మారకము నిచ్చునెడల బలాధికులు. ద్వితీయాధిపతి సప్తమాధిపతికంటె నెట్లు బలవంతుఁడో యట్లే ద్వితీయాధిపతితో గలసిన గ్రహములును మారకమునిచ్చునెడల బలాధికులని తలంపవలయును.

శ్లో. తేషాం దశావిపాకేషు సంభవే న్నిధనం నృణాం
తేషా మసంభవే సాతు ద్వ్యయాధీశదశాస్వపి. 25

తా. సప్తమ ద్వితీయాధిపతులయొక్కయు, ఆస్థానములనుండు గ్రహములయొక్కయు ఆస్థానాధిపతులతో గలసియున్న గ్రహముల యొక్కయు మహాదశలందు మారకము కలుగును. అట్టిమహాదశలు సంభవింపనియెడల లగ్నాపేక్షచే వ్యయాధిపతియొక్క మహాదశయందైనను మారకము కలుగును.

శ్లో. అలాభే పునరేతేషాం సంబంధేన వ్యయేశితుః
క్వచిచ్ఛుభానాంచ దశాస్వష్టమేశదశాసుచ. 26

తా. ద్వితీయసప్తమాధిపతుల మహాదశలుగాని సప్తమద్వితీయాధిపతులతో గూడియుండు గ్రహములయొక్కయు, ద్వితీయసప్తములందుండు గ్రహములయొక్కయు, వ్యయాధిపతియొక్కయు మహాదశలు సంభవింపనియెడల వ్యయాధిపతియొక్క సంబంధము కలిగియున్న శుభగ్రహముల దశలయందు అట్టిసంబంధము కలిగియున్న అష్టమాధిపతి దశయందును గూడ నొకానొకప్పుడు మారకము జరుగును.

శ్లో. కేవలానాంచ పాపానాం దశాసు నిధనం క్వచిత్
కల్పనీయం బుధైః నృణాం మారకానా మదర్శనే. 27

తా. మారకులు బాత్తిగకనుపింపనప్పుడు మారకలక్షణములు లేని యధికపాపగ్రహముల దశలయందుగూడ మనుష్యులకు మరణము గలుగుచుండునని విద్వాంసుల యభిప్రాయము.

శ్లో. మారకై స్సహ సంబంధా న్నిహంతాపాపకృచ్ఛనిః
అతిక్రమ్యేతరా న్సర్వాన్భవత్యేవ నసంశయః. 28

తా. పాపియగు శని, (లాభాధిపత్యమున్నగు పాపాధిక్యములు గల శని.) మారకులతో సంబంధముచేత సమస్తమారకగ్రహములను అనగా వానికి ముందువెనుకనువచ్చు మారకగ్రహములనందరిని అతిక్రమించి నిస్సందేహముగా తానే మారకుఁడై యుండును.

భుక్తిలక్షణము.

శ్లో. నదిశేయు ర్గ్రహా స్సర్వే స్వదశాసు స్వభుక్తిషు
శుభాశుభఫలం నృణా మాత్మభావానుసారతః. 29

తా. నవగ్రహములును తమతమ మహాదశలయందు స్వభుక్తులయందు తమతమ భావముల ననుసరించి శుభపాపఫలముల నీయరు.

శ్లో. ఆత్మసంబంధినో యేచ యే యే నిజసధర్మిణః
తేషా మంతిర్దశాస్వేవ దిశంతి స్వదశాఫలం. 30

తా. మహాదశానాధునితో నేగ్రహములకు సంబంధము కలుగుచున్నదో యాగ్రహములయొక్కయు, మహాదశానాధునితో సంబంధము లేకపోయినను యేగ్రహములు మహాదశానాధునితో సమానమగు ధర్మములు కలిగియున్నవో యాగ్రహములయొక్కయు, అంతర్దశలయందు మహాదశానాధుఁడు తనయొక్కఫలము నిచ్చును.

శ్లో. ఇతరేషాం దశానాధవిరుద్ధఫలదాయినాం
తత్తత్ఫలానుగుణ్యేన ఫలాన్యూహ్యాని భుక్తిషు. 31

తా. మహాదశానాధునికి విరోధమగు ఫలితములనిచ్చు గ్రహములయొక్క అంతర్దశలయందు దశానాధునియొక్కయు అంతర్దశానాధునియొక్కయు బలభేదముల ననుసరించి శుభపాపఫలముల నిచ్చువారగుదురని యభిప్రాయము.

శ్లో. స్వదశాయాం త్రికోణేశో భుక్త్యాకేంద్రపతేశ్శుభం
దిశేతోఽపి తథా నోచే దసంబంధేపిపాపకృత్. 32

తా. కోణాధిపతి 3. 6. 8. 11 స్థానాధిపత్యములు లేనివాడైన యెడల తనకు కేంద్రాధిపతియొక్క సంబంధముకలిగినను లేకపోయినను తన మహాదశయందు కేంద్రాధిపతిభుక్తియందు శుభఫలము నొసంగును. ఇట్లే పాపుడగు కేంద్రాధిపతి తనమహాదశలో కోణాధిపతిభుక్తియందు పైన జెప్పినట్టి సంబంధమేమియును లేకపోయినను శుభఫలంబు నిచ్చువాడగును.

శ్లో. ఆరంభో రాజయోగస్య భవే న్మారకభుక్తిషు
ప్రలయంతి త మారబ్ధం క్రమశః పాపభుక్తయః 33

తా. మారకలక్షణముగల రాజయోగకారకగ్రహముల మహాదశలయందు స్వభుక్తులయందే రాజయోగము ప్రారంభమగును. అట్లు ప్రారంభించినరాజయోగము మహాదశానాథునితో సంబంధములేని పాపుల అంతర్దశలయం దెక్కువ యగును.

శ్లో. తత్సంబంధిశుభానాంచ తథాపున రసంయుతాం
శుభానాంతు సమత్వేన వా సంనయుగ్యోగకారిణః 34

తా. రాజయోగకారకుడగు గ్రహముతో సంబంధముగల శుభగ్రహములయొక్కభుక్తు లారాజయోగమునభివృద్ధిజేయుచున్నవి. మరియు నట్టిసంబంధములేని శుభగ్రహములయొక్క భుక్తులును, అట్టిసంబంధములేని యోగకారకగ్రహభుక్తులును రాజయోగమును సమత్వముగాజరుపును.

శ్లో. శుభస్య స్వవియుక్తస్య దశాయాం యోగకారకాః
స్వస్వభుక్తిషు చేచ్ఛంతి కుత్రచిద్యోగకారిణాం. 35

తా. రాజయోగకారకగ్రహములు తమతో సంబంధములేని శుభగ్రహముయొక్క మహాదశయందు తమ అంతర్దశలయందు రాజయోగము నిచ్చెదరని యభిప్రాయము.

శ్లో. తమోగ్రహౌ శుభారూఢావసంబంధాశ్చ కేంచిత్
అంతర్దశానురూపేణ భవేతాం యోగకారకౌ. 36

తా. శుభస్థానములనుండినట్టియు యే యితరగ్రహములతోడను సంబంధములేనట్టియు రాహుకేతువులు తమ మహాదశలయందువచ్చెడి యంతర్దశల ననుసరించి రాజయోగము నిచ్చువారగుదురు. ఇటనే యితర గ్రహములనుటలో నితరపాపగ్రహసంబంధమని యూహింపవలసి యున్నది.

శ్లో. పాపా యది దశానాథా శ్శుభాశ్చ తదసంయుజాం
భుక్తయః పాపఫలదాః తత్సంయుక్శుభభుక్తయః. 37

శ్లో. భవంతి మిశ్రఫలదా భుక్తయో యోగకారిణాం
అత్యంతపాపఫలదా భవంతి తదసంయుజాం. 38

తా. మహాదశానాధులు పాపులైనవారితో సంబంధములేని యితర శుభగ్రహముల యంతర్దశలయందు పాపఫలమిచ్చెదరు. అట్టి దశానాథుల సంబంధముకలిగినను శుభులు మిశ్రమఫల మొసంగుదురు. అట్టివారితో సంబంధ మెంతమాత్రమునులేని రాజయోగకారక గ్రహములు మిక్కిలి పాపఫల మొసంగును.

శ్లో. స త్యపి స్వేన సంబంధే న హంతి శుభభుక్తిషు
హంత్యసత్యపి సంబంధే మారకః పాపభుక్తిషు. 39

తా. మహాదశానాధుడగు మారకుడు తనతో సంబంధమున శుభుల అంతర్దశలయందు మారకము నీయడు. కాని తనతో సంబంధము లేకపోయినను యితరపాపగ్రహముల భుక్తులయందు మారకము నిచ్చువాడగును.

శ్లో. పరస్పరదశాయాంతు స్వభుక్తౌ సౌరిభార్గవౌ
ప్రదిశేతాం వ్యత్యయేవ విశేషణ శుభాశుభం. 40

తా. శని శుక్రులలో నొకని మహాదశయందు రెండవవాని యంతర్దశ వచ్చునెడ విశేష శుభపాపఫలములను భుక్తిలక్షణమును బట్టి యిచ్చుచుందురు,

శ్లో. ప్రతిలగ్నం సమాలక్ష్య పూర్వోద్దిష్టావిరోధితః
త త్తద్గ్రహస్వరూపాణి క్రమేణైవ వివృణ్మహే. 41

తా. ప్రతిలగ్నమునుగూర్చియు విచారించి యీవరకు జెప్పిన సూత్రముల ఆధారముపై గ్రహముల శుభపాపత్వముల నిర్ణయించుచున్నాము.

శ్లో. మందసౌమ్యసితాః పాపాః శుభౌ గురుదివాకరౌ
న శుభం యోగమాత్రేణ ప్రభవేచ్ఛనిజీవయోః. 42

శ్లో. పరంతు తేన జీవస్య పాపిత్వ మపి సిధ్యతి
కవి స్సాక్షా న్నహంతా స్యా న్మారకత్వేనలక్షితః. 43

శ్లో. మందాదయో నిహంతారో భవేయుః పాపినో గ్రహాః
శుభాశుభఫలాన్యేవం జ్ఞాతవ్యాని క్రియాభువః. 44

తా. మేషలగ్నజాతకునకు శని బుధశుక్రులు పాపులు. శనిలాభాధిపతియగుటచేతను బుధుడు తృతీయ షష్ఠాధిపతి యగుటచేతను శుక్రుడుభయమారకస్థానాధిపతి యగుటచేతను పాపులు రవిగురులు శుభకరులు. రాజ్యాధిపతియగు శనియు, భాగ్యాధిపతియగు గురుడును సంబంధముగలవారైనచో శుభఫలము నీయరు ఏలననగా; శనికి లాభాధిపత్యము గలుగుటచే యోగభంగమగుచున్నది. శుక్రుడు మారకము నీయడు. శనిమొదలగు పాపగ్రహములు మారకము నిచ్చెదరు.

వృషభలగ్నమునకు.

శ్లో. జీవశుక్రేందవః పాపాః శుభౌ శనిదివాకరౌ
రాజయోగకర స్సాక్షా దేకఏవాంశుమత్సుతః॥ 45

శ్లో. జీవాదయోగ్రః పాపాః ఘ్నంతి మారకలక్షణాః
బుధై స్తత్ఫలాన్యేనం జ్ఞేయాని వృషజన్మనః॥ 46

తా. వృషభలగ్నజాతకునకు గురుశుక్రచంద్రులు పాపులు. గురుడష్టమ లాభాధిపతియగుటచేతను శుక్రుడులగ్నషష్ఠాధిపతియగుటచేతను చంద్రుడు తృతీయాధిపతియగుటచేతను పాపుడని వచింపబడెను. శనిసూర్యులు శుభులు భాగ్యరాజ్యాధిపతియగు శనియొక్కడే రాజయోగము నిచ్చువాడగును గురుడుమున్నగు పాపగ్రహములు మారకలక్షణములు గల్గినయెడల మారకము నిచ్చుటలో బలవంతు లగుదురు.

మిధునలగ్నమునకు.

శ్లో. భౌమజీవారుణాః పాపాః ఏకఏవశుభః కవిః
శనైశ్చరేణ జీవస్య యోగమేషభువోయదా॥ 47

శ్లో. నాలం శని ర్నిహంతుం తల్లక్షణాత్పాపిన స్త్వలం
జ్ఞాతవ్యాని ద్వంద్వజస్య ఫలాన్యేవంప్రకారతః॥ 48

మిధునలగ్నజాతకులకు కుజగురు సూర్యులు పాపులు. కుజుడు 6-11 స్థానములకు అధిపతియగుటచేతను, గురుడు 7-10 కేంద్రములకు అధిపతియగుటచేతను, రవి తృతీయాధిపతి యగుటచేతను పాపులని చెప్పబడెను. శనిగురుల సంబంధము శుభము నీయజాలదు. శుక్రుడు శుభుడు శని ఆయుష్కారకుడై భాగ్యాధిపతియగుటవలన మారకము నీయజాలడు. కుజుడు మున్నగువారు మారకము నిత్తురు.

శ్లో. కుజభాన్విందవః పాపాః ఏకఏవ శుభః కవిః
రాజయోగకరౌ శుక్రసోమపుత్రౌ శుభాన్వితౌ॥ 49

శ్లో. శని జీవసమాయోగాత్ఫలం మేషభువోయథా
విదుస్సౌమ్యోన్నహంతా స్యాన్మారకత్వేనలక్షితః॥ 50

శ్లో. భౌమాదయో నిహంతారో భవేయుః పాపినోగ్రహాః
శుభాశుభఫలంజ్ఞేయ మిత్థం హియుగజన్మనః 51

తా. రవికుజచంద్రులు పాపులు, కుజసూర్యులు పైనవివరింపబడిన కారణములవలనను, చంద్రుడు ద్వితీయాధిపతి యగుటవనను పాపులని చెప్పబడినది. శుక్రుడొక్కడే శుభదు శుభులతోజేరిన బుధశుక్రులు యోగకారకులగుదురు. కాని వారు ప్రత్యేకముగా రాజయోగము నీయజాలరు. శనిగురుల సంబంధము యోగింపదు. చంద్రుడు స్వతంత్రముగా మారకమీయజాలడు. కుజుడుమున్నగు పాపగ్రహములు మారకము నిచ్చుటలో బలవంతులు.

కర్కాటకలగ్నమునకు.

శ్లో. భార్గవేందుసుతౌ పాపా భూసుతాంగిరసౌ శుభౌ
ఏకఏవ భవేత్సాక్షాత్ భూమిజో యోగకారకః॥ 52

శ్లో. నహంతా రవిరన్యేతు పాపినో మారకాహ్వయాః
శుభైరసంభవస్త్వైవం ఫలాన్యూహ్యాని సూరిః 53

తా. కర్కాటక లగ్నజాతకులకు బుధ శుక్రులు పాపులు. చతుర్థలాభాధిపతియగుటచే శుక్రుండును, తృతీయవ్యయాధిపతి యగుటచే బుధుడును పాపులని చెప్పబడినది. కుజగురులు శుభులు, కుజుడొక్కడే శుభయోగము నిచ్చువాడగును. ఏలననగా కుజునకు పంచమకోణాధిపత్యమును దశమాధిపత్యముకూడ గలిగియుండుటచే నీతడే స్వతంత్రముగా రాజయోగమునిచ్చువాడని చెప్పబడెను. రవి స్వతంత్రముగా మారకము నీయజాలడు. మారకలక్షణముగల యితరపాపగ్రహములు మారకులగుదురు.

సింహలగ్నమునకు.

శ్లో. రౌహిణేయసితౌ పాపౌ కుజ ఏక శ్శుభావహః
ప్రభవేద్యోగమాత్రేణ న శుభం గురుశుక్రయోః 54

శ్లో. ఘ్నంతి సౌమ్యాదయః పాపాః హంతృలక్షణలక్షితాః
ఏవం ఫలాని జ్ఞేయాని సింహజస్య మనీషిభిః 55

తా. సింహాలగ్న జాతకులకు బుధ శుక్రులు పాపులు. బుధుడు ద్వితీయలాభాధిపత్యములు కలవాడగుటచేతను, శుక్రుడు తృతీయరాజ్యాధిపతియగుటచేతను పాపులు. కుజుడొక్కడే శుభము నిచ్చువాడగును. గురుశుక్రుల సంబంధము యోగింపదు. బుధుడు మున్నగువారు మారకులగుదురు.

కన్యాలగ్నమునకు

శ్లో. కుజజీవేందవః పాపాః ఏకో భృగుసుత శ్శుభః
భార్గవేందుసుతావేవ భవేతాం యోగకారకౌ. 56

శ్లో. న హంతా కవి రన్యేతు మారకాఖ్యాః కుజాదయః
ఘ్నంతిపాపాః ఫలాన్యూహ్యాన్యేనం కన్యాభువోబుధైః 57

తా. కన్యాలగ్న జాతకునకు కుజగురు చంద్రులు పాపులు. 3, 8 స్థానముల కధిపతియగుటచే కుజుడును, ఉభయకేంద్రాధిపత్యము గలుగుటచే గురుడును, లాభాధిపతి యగుటచే చంద్రుడును పాపులు. శుక్రుడొక్కడే శుభుడు. బుధశుక్రు లిరువురుమాత్రమే యోగకారకులు. శుక్రుడు ద్వితీయాధిపతియైనను మారకము నీయజాలడు. మారకలక్షణములుగల కుజుడు మున్నగువారు మారకమునిచ్చుటలో బలీయులగుదురు.

తులాలగ్నమునకు.

శ్లో. జీవార్కమహిజాః పాపాః శనైశ్చరబుధౌ శుభౌ
భవేతాం రాజయోగస్య కారకా వింధుతత్సుతౌ. 58

శ్లో. కుజోనహంతాజీవాద్యాః పరే మారకలాంఛనాః
నిహంతారః ఫలాన్యేవం జ్ఞాతవ్యాని తులాభువః 59

తా. తులాలగ్న జాతకులకు రవి కుజ గురులు పాపులు. 3, 6 స్థానముల కధిపతియగుటచే గురుడును, లాభాధిపతియగుటచే సూర్యుడును, ద్వితీయసప్తమాధిపతియగుటచే కుజుడును దోషులుగా చెప్పబడె

ను. శనిబుధు లిరువురును శుభులు. బుధచంద్రు లిరువురకును సంబంధము కలిగినయెడల వారిరువురును యోగకారకులగుదురు. ఉభయ మారకాధిపతియగుటచే కుజుడు మారకము నీయడు. మారకలక్షణములు గల్గిన గురుడు మున్నగువారు మారకము నిచ్చుటలో బలీయులని గ్రహింపవలయును.

వృశ్చికలగ్నమునకు.

శ్లో. బుధశుక్రార్కతనయాః పాపా స్సురగురు శ్శుభః
సూర్యాచంద్రమసావేవ భవేతాం యోగకారకౌ. 60

శ్లో. జీవోనహంతాసౌమ్యాద్యాఃహంతారో మారకాహ్వయాః
త్తత్తత్ఫలాని విజ్ఞేయా న్యేవం వృశ్చికజన్మనః 61

తా. వృశ్చికలగ్నజాతకులకు బుధ శుక్ర శనులు పాపులు 8, 11 స్థానముల కధిపతియగుటచే బుధుడును 6, 12 స్థానముల కధిపతియగుటచే శుక్రుడును శని తృతీయాధిపతియగుటచేతను పాపుడని చెప్పబడెను. గురుడు శుభుడు. రవిచంద్రు లిరువురకును సంబంధమున్నయెడల వీరు రాజయోగము నిచ్చువా రగుదురు. గురుడు ద్వితీయాధిపతియైనను మారకము నీయడు. మారకలక్షణములుగల బుధుడు మొదలగు గ్రహములు మారకమునిచ్చుటలో బలీయులని గ్రహింపవలయును.

ధ ను ర్ల గ్న ము న కు.

శ్లో. ఏకఏవ కవిః పాపః శుభౌ భౌమదివాకరౌ
యుక్తోభాస్కరసౌమ్యాభ్యాంస్యాన్నహంతాంశుమత్సుతః.

శ్లో. ఘ్నంతి శుక్రాదయః పాపాః హంతృలక్షణలక్షితాః
జ్ఞాతవ్యాని ఫలాన్యేవం చాపజస్యమనీషిభిః. 63

తా. ధనుర్లగ్నజాతకులకు శుక్రుడొక్కడే పాపుడగుచున్నాడు. 6, 11 స్థానాధిపత్యములచే శుక్రుడు పాపి. కుజసూర్యులు శుభకరులు.

రవిబుధులతో జేరిన శని మారకమునీయడు. శుక్రుడు మున్నగు మారక లక్షణములుగలవారు మారకము నిచ్చెదరు.

మకరలగ్నమునకు.

శ్లో. కుజజీవేందవః పాపాః శుభౌ భార్గవచాంద్రజౌ
రాజయోగకర స్స్యాతా దేకఏవ భృగోస్సుతః. 64

శ్లో. చంద్రాత్మజేన సంయుక్తో విశేషఫలదాయకః
స్వయంచైవ న హంతా స్యా న్మందో భౌమాదయఃపరే. 65

శ్లో. నిహంతారః పాపిన స్తే మారకత్వేనలక్షితాః
జ్ఞాతవ్యాని బుధై రేవం ఫలానిమృగజన్మనః. 66

తా. మకరలగ్నజాతకులకు కుజగురుచంద్రులు పాపులు. కుజుడు 11 స్థానమున కధిపతియగుటచేతను, గురుడు 3, 12 స్థానముల కధిపతి యగుటచేతను, చంద్రుడు 7 స్థానమునకధిపతియగుటచేతను పాపులని వారిని లెక్కించవలెను. శుక్రుడును బుధుడును శుభులు. శుక్రుడొక్కడే రాజయోగమునిచ్చువాడు. శుక్రబుధులసంబంధము విశేషమగు యోగము నిచ్చువారగుదురు. శని స్వయముగా మారకమునిచ్చువాడు కాడు. మారకలక్షణములు కలిగిన కుజుడు మున్నగువారు మారకము నొసంగుటలో బలవంతులు.

కుంభలగ్నమునకు.

శ్లో. జీవచంద్రకుజాః పాపాః ఏకో దైత్యగురు శ్శుభః
రాజయోగకరో భౌమకవీ త్వేకోబృహస్పతిః. 67

శ్లో. న హంతా ఘ్నంతిభౌమాద్యాః మారకత్వేన నిశ్చితాః
ఏవమేవ ఫలాన్యేతా న్యూహ్యాది ఘటజన్మనః. 68

తా. కుంభలగ్నజాతకులకు గురుకుజచంద్రులు పాపులు. గురుడు 2, 11 స్థానములకధిపతియగుటచేతను, చంద్రుడు 6 స్థానమున కధిపతి యగుటచేతను, కుజుడు తృతీయాధిపతియగుటచేతను పాపులని చెప్ప

బడెను. ఈలగ్నజాతకులకు శుక్రుడొక్కడే శుభుడు. కుజశుక్రు లిరువుర కును సంబంధము కలిగెనేని వారిరువురును యోగకారకు లగుదురు. గురుడు స్వతంత్రముగా మారకమునీయడు. కుజుడు మున్నగుమారక లక్షణములు గలిగినవారు మారకమునిత్తురు.

మీనలగ్నమునకు.

శ్లో. మందశుక్రాంశుమత్సౌమ్యాఃపాపాః భౌమవిధూ శుభౌ
మహీసుతగురూ యోగకారిణౌ నైవభూసుతః. 69

శ్లో. మారకోమారకాభిఖ్యాః మందాద్యాఃఘ్నంతిపాపినః
ఇత్యూహ్యాని బుధైః స్వమ్యగ్ఫలాని ఝుషజన్మనః. 70

తా. మీనలగ్నజాతులకు శనిశుక్రరవిబుధులు పాపులు. 11, 12 స్థానముల యాధిపత్యముచే శనియు, 3, 8 స్థానాధిపత్యములచే శుక్రుడును 6 స్థానాధిపత్యముచే సూర్యుడును, ఉభయకేంద్రాధిపత్యముచే బుధుడును పాపులనిచెప్పబడును. కుజచంద్రులు శుభులు. కుజగురులు యోగమునిచ్చువారగుదురు. కుజుడు మారకము నీయజాలడు. మారక లక్షణములుగల శనిమున్నగువారు మారకమునిచ్చెదరు.

శ్లో. శుభపాపాత్మకతయా నిర్దిష్టైభ్యఃపరేగ్రహః
భవంతి ఫలదా స్థానసాహచర్యానుగుణ్యతః. 71

తా. వీరు శుభకరులు, వీరు పాపులు అని చెప్పబడనిగ్రహములు యితరులతో గలియుట యితరస్థానముల నుండుట మున్నగువానిని బట్టి ఫలముల నిర్ణయింపవలసియుండును.

శ్లో. పుత్రధారాదిలాభస్య శుభాత్మకతయాగ్రహాః
ప్రదిశంతి శుభాన్యేవ స్వదశాసు స్వభుక్తిషు. 72

తా. పుత్రులు, భార్య, మున్నగువారుగలుగుట శుభప్రదమైనది కావున నయ్యది శుభగ్రహములయందుగాని యితరగ్రహముల దశలలో

వచ్చు శుభగ్రహముల భుక్తులలో గాని ఆయాలాభములు కలుగు చుండును.

శ్లో. యోగేషుకేచిజ్జాయంతే మూఢాఃకాశ్మీరగర్దభాః
యోగా స్తే కిం కరిష్యంతి స్వదశానా మనాగమే. 73

తా. కొందరు మూఢులు మంచిగొప్పయోగముగలవారై జన్మింతురు. కాని యోగకారకగ్రహదశలు రాకపోయినయెడల లాభముగలుగదు. యోగముండియు ప్రయోజనము లేకుండును.

శ్లో. పాపినశ్చేద్గ్రహాస్తేషా ముచ్చత్వేసతి కింఫలం
బలవత్వేఘాతుకానాం యత్ఫలం లభతేహితత్. 74

తా. గ్రహములు పాపులైయున్నయెడల వారు ఉచ్చయందున్ననేమిలాభము. దోషులు బలాధికులైన చెడుఫలము కలుగునట్లే పాపులుచ్ఛయందున్న నెక్కుడుపాపఫలము కలుగును.

శ్లో. ఫలాని గ్రహచారేణ సూచయంతి మనీషిణః
కో వక్తా తారతమ్యస్య త మేకం వేధసంవినా.

తా. జ్యోతిష్కులు గ్రహచారవశమున శుభాశుభఫలములను సూచింతురేగాని వారియొక్క తారతమ్యముల నిర్ధారణ సేయజాలరు. అది యొక్క బ్రహ్మకే తెలియును కాని యితరులకు తెలియదు.

సంపూర్ణము.



# గోపాలరత్నాకరము.



శ్లో. సౌమ్యస్వామియుతేక్షితం శుభకరం తద్భావసౌఖ్యప్రదం
షష్ఠద్వాదశరంధ్రనాథ సహితం క్రూరైశ్చ నష్టప్రదం
నీచేవా రిపురంధ్రరిప్ఫసదనేష్వస్తంగతో వా యదా
దౌర్బల్యం త్వథ చోచ్చమిత్రగృహగః ఖేటో బలం ప్రాప్నుయాత్.

తా. లగ్నమునకు తనుస్థానమందురు. తనుస్థానమున శుభ గ్రహము లున్నను, శుభగ్రహములా భావాధిపతిని జూచినను, ఆభావాధి పతి యందున్నను తనుస్థానము శుభప్రదమైనదని యెంచవలయును. లగ్న మున 6, 8, 12 స్థానాధిపతులున్నను, వారు లగ్నమును చూచినను భావము బలహీనమైనదగును. భావాధిపతి నీచయందున్నను 6, 8, 12 స్థానములనున్నను, అస్తంగతుండైనను, బలహీనుడని యెంచవలయును. భావాధిపతి యుచ్ఛయందుగాని మిత్రక్షేత్రములందుగాని యున్నయెడల బలవంతుడని తలంపవలయు—

శ్లో. లగ్నేవా రవిభౌమసౌమ్యఖచరైరులత్రైధవావీక్షితే
జాత స్సుందరమూర్తిరేవ శనిరాహుభ్యాంచ కృష్ణాంగకః
తైర్మిశ్రైశ్చఖగైస్తథా సురుచిరశ్యామాంగకోజాయతే
శ్లేష్మాశుక్రగురూ నిశాకరశనీ వాతశ్చ పిత్తంపరే. 2

తా. లగ్నమున రవి, చంద్ర, కుజ, బుధ, శుక్ర, గురు లున్నను, వారు లగ్నమును జూచినను జాతకుడు సుందరతనుడగును. లగ్నమున శని రాహువులున్నను, వారలచే లగ్నము చూడబడినను, జాతకుడు నల్లనివాడగును. లగ్నమున కొన్ని శుభగ్రహములును మరికొన్ని పాప గ్రహములును యున్నయెడల జాతకుడు నల్లనివాడైనను సుందరుడగును. లగ్నమున గురు శుక్రులున్నను, వారిరువురును లగ్నమును చూచినను

శ్లేష్మతత్వము గలవాడగును. లగ్నమునకు శని చంద్ర సంపర్కమున్న యెడల వాతతత్త్వము గలవాడగును. ఇతరగ్రహసంపర్క మున్నయెడల పైత్యతత్త్వము గలవాడగును.

శ్లో. ఛాయాపుత్రగురూ చ సత్వగుణకౌ భౌమోరగౌ తామసౌ
కేతుర్జ్ఞానబలోన్యఖేచరయుతౌ దృష్టౌభ వేద్రాజసః
స్థూలాంగ శ్శనిచంద్రకౌ యది రవిజ్ఞారైస్తుమధ్యాంగక
శ్చాన్యైరల్పతనుర్భవేద్యుతివశాల్లగ్నస్యసంయోగతః. 3

తా. లగ్నమున గురుశనులలో నెవరున్నను సాత్వికుడగును. లగ్నమునకు కుజ రాహు సంపర్కమున తామసుడగును. లగ్నమునకు కేతుసంపర్కమున్న జ్ఞానియగును. తక్కిన గ్రహసంపర్కమున్న రాజసుడగును. లగ్నమునకు శని చంద్ర సంపర్కము కలిగిన స్థూలదేహముగలవాడగును. లగ్నమునకు రవి బుధ గురు సంపర్కమున్న మధ్యమదేహియగును. తక్కినగ్రహములకు లగ్నసంపర్కమున్నయెడల జాతకుడు కృశించిన దేహము గలవాడగును.

శ్లో. లగ్నే శే యది కేంద్రకోణ సహితే మిత్రాలయే స్వోచ్చభే
జాతః కీర్తియుతోపి కర్కిమృగకీటేష్వస్తభే లగ్నభే
జీవశ్చేద్యది సంస్థితశ్చ కురుతే చారామసంస్థాపనం
దేవాగారతటాక శిల్పరచనాం పూజ్యశ్చ భూమీతలే. 4

తా. లగ్నాధిపతి కేంద్రకోణములగాని యుచ్చస్వక్షేత్ర మిత్రక్షేత్రములందుగాని యున్న యశస్సులభించును. గురుడు మేష కర్కట వృశ్చిక మకరములగాని లగ్నమునకాని సప్తమమునగాని యున్న ధర్మకార్యాచరణుడగుచు లోకులచే పూజింపబడును.

శ్లో. లగ్నేశ్వరాణపి యుతే చ సౌమ్యై స్సౌమ్యైరథవా పశ్యతిలగ్నభావం
కేంద్రత్రికోణోచ్చగతే తదీశే శరీరసౌఖ్యం లభతే హి జాతః॥ 5

లగ్నాధిపతి శుభులతో గలసినను శుభులచే జూడబడినను, కేంద్రకోణములందున్నను సౌఖ్యయుతుడగును.

శ్లో. క్రూరాలయే రిపుగృహే వ్యధవాపి నీచే క్రూరస్థితే యది
యుతే వ్యయరంధ్రసంస్థే। షష్ఠంగతే తనుపతౌ తనుగె ఖ
లేవా తత్కాలసంభవనరస్య న దేహసౌఖ్యం॥ 6

లగ్నాధిపతి శత్రుక్షేత్రములందైనను, నీచయందైనను పాపులతో గూడియున్నను, పాపులచే చూడబడుచున్నను 6, 8, 12 స్థానములనున్నను జాతకునకు సౌఖ్యజీవనము గలుగదు.

శ్లో. నపుంసకాదర్క సుతేక్షుసంస్థాః క్లీబగ్రహాదారసుతేక్షణాని
పశ్యంతి తేశాస్త్రవిదోవదంతి నపుంసకం జాతకమల్పవీర్యం॥ 7

2, 5, 7, స్థానముల శనిబుధకేతువులున్నను, ఆ స్థానములను వారు చూచినను జాతకుడు నిర్వీర్యుడగును,

శ్లో. లగ్నస్థితేత్వర్కిణి దుర్బలాంగో। సవాతరు క్చాన్యవధూవిలోలః
3
కుజేథవా శస్త్రకృతప్రణాశవహ్నితాశనసస్ఫోటక మేహరోగీ॥ 8

శని లగ్నమందున్నను, లగ్నమును జూచినను జాతకుడు దుర్బలుడు స్త్రీలోలుడును అగును. లగ్నమునకు కుజసంపర్కమున్న జాతకుడు మేహరోగియు, మశూచిమొదలగు వ్యాధులకును శస్త్రాస్త్రములకును భయపడువాడగును.

శ్లో. కనిద్రేక్కాణగే లగ్నే శనౌతత్రైవ సంస్థితే
యుక్తేచ కుజరాహుభ్యాం జాతఃపంగు ర్భవేద్ధ్రువం. 9

లగ్నము శనిద్రేక్కాణమై యుండ నందు శని కుజరాహులతో సంపర్కము గల్గియున్న జాతకుడు కుంటివాడగును.

శ్లో. సుఖారిరంధ్రవ్యయభేషు కుత్రచిచ్చంద్రార్కభౌమా
యదిసంయుతౌస్యుః। పాపేక్షితావా రిపు వీక్షితావా
జాతస్తు బాధిర్య ముపైతి నూనం॥ 10

4, 6, 8, 12 ఈస్థానముల సూర్యుడు, చంద్రుడు, కుజుడు కలసియుండి పాపులచేగాని శత్రుగ్రహములచేగాని చూడబడినయెడల జాతకుఁడు చెవిటివాడగును.

శ్లో. భూసుతోర్కిరవిశ్చంద్ర ఏతే పంచమసంస్థితాః
శుభదృగ్యోగసత్వేపి కర్ణఘ్రాణ వినాశకాః॥ 11

శనికుజరవిచంద్రులు పంచమమునయుండి శుభగ్రహము యొక్క సంపర్కముగల్గియున్నయెడల జాతకుడు ముక్కు చెవులు కోయబడువాడగును.

శ్లో. ఆయుస్థానగతే భౌమే శన్యర్కఫణిసంయుతే
నాసికాచ్ఛేదనం ప్రోక్తమితి కేరళనిర్ణయః॥

అష్టమమున శనికుజరాహువులు కలసియున్న నాజాతకునకు నాసికాభంగమగునని కేరళమున జెప్పబడియెను.

శ్లో. ఆయుస్థానగతే భౌమే భానుజేన యుతే క్షితే
శిరచ్ఛేదన యోగో వా రణేవా మరణం భవేత్ 13

అష్టమమున కుజుడుండి శనిసంపర్కము గల్గియున్నయెడల శిరచ్ఛేదమునుగాని మరణమునుగాని జాతకుడుపొందును.

శ్లో. శనిక్షేత్రగతే రాహౌ సింహగే రవినందనే
తాన్యేన జన్మలగ్నాని యదిశ్చేం రణేహతం॥

సింహము, మకరము, కుంభము వీటిలో నొకటి లగ్నమైయుండ నపుడు మకరకుంభముల రాహువు, సింహమున శనియున్నయెడల జాతకుఁడు యుద్ధమున మరణించును.

శ్లో. సప్తమే చాష్టమే వాపి శనిజీవౌ సమన్వితౌ
రక్తకాసో రవిస్తత్ర క్షయరోగో న సంశయః. 15

7, 8 స్థానముల గురుశనులు కలసియున్నయెడల జాతకుడు రక్తకాసరోగియగును. అట్టి గురుశనులతో రవిగలసిన జాతకుఁడు క్షయవ్యాధిగలవాడగును.

శ్లో. లగ్నాధిపే లగ్నగతే చతుర్ధే ధర్మాధిపే ధర్మగతే తనుస్థే
సురార్యదైత్యార్యయుతేక్షితేచ సౌభాగ్యయుక్తస్సతతంహిజాతః
లగ్నాధిపతి లగ్నమునగాని, భాగ్యాధిపతి భాగ్యలగ్నములగాని యుండి గురుశుక్ర సంపర్కముగలిగిన జాతకుఁడు ధనవంతుడగును.

శ్లో. లగ్నస్థితే రవౌ భానోశ్శిరోబ్భ్రంచోన్నతాతనుః
భవేయుర్దశనా దీర్ఘా జాతస్య తురగాద్భయమ్. 17
లగ్నమున రవిరాహువులుండిరేని జాతకునితల చిన్నదిగానుండును. శరీరము పొడవైనదగును. అట్టిజాతకుఁడు గుఱ్ఱమునుండిపడుట మొదలగువాటిచే బాధితుడగును.

శ్లో. తృతీయాధిపతౌ సౌమ్యే కుజమందయుతేక్షితే
లగ్నసంస్థేతు జాతస్య మూత్రద్వారద్వయంభవేత్. 18
తృతీయాధిపతియైన బుధుడు కుజశనులతోఁ గూడి లగ్నమున నున్న జాతకుని మూత్రద్వారము రెండుగా విభజింపబడును.

శ్లో. కుటుంబగే గీష్పతినా చ యుక్తే చంద్రేణయుక్తే ప్యథవాతృతీయగే
షష్టాష్టమద్వాదశనీచగే చ జాతస్తు మూకోభవితా నసంశయః. 19
ద్వితీయాధిపతి గురుచంద్రులలో నొకనితోఁగలసి 6, 8, 12 స్థానముల బలవర్జితుడై యున్నయెడల జాతకుడు మూగయగును.

శ్లో. షష్టేశ స్సప్తమేశో వా వ్యయాధీశసమన్వితః
జాతస్య శనినాదృష్టా మూత్రకృఛ్రింతనోతిహి. 29
షష్ఠాధిపతిగాని సప్తమాధిపతిగాని ద్వాదశభావాధిపతితో గలసి శనిచే చూడబడినయెడల జాతకునకు మూత్రకృచ్ఛ్రము కల్గును.

శ్లో. కుజార్కిఫణిన ష్షష్టే గురురాహూ చ లగ్నగౌ
కుర్యుర్జాతస్యాండరోగం స్వకాలేనాత్ర సంశయః. 21
ఆఱవస్థానమున రవి కుజ రాహువు లున్నను లగ్నమున గురు రాహువు లున్నను ఆశనికుజరాహుగురులదశయందు అండరోగము కలుగును.

శ్లో. కుజరాహుద్వయం లగ్నే జాతః కుబ్జో భవేన్నరః
కుజార్కి-ఫణినః త్రిస్థాఅండరోగకరాః స్మృతాః. 22

లగ్నమున కుజరాహువులున్న జాతకుడు పొట్టివాడగును. తృతీయమున శనికుజరాహువులున్న జాతకుడు అండరోగపీడితుడగును.

శ్లో. తృతీయాధిపలగ్నేశా వేకరాశిగతౌ యది
రాహుదృగ్యోగమాత్రేణ భవితా యమళోదయః 23

లగ్నతృతీయాధిపతులు యేకరాశియందుండి రాహువుతో గలసియున్న నాజాతకుడు కవలపిల్లలుగలవాడగును.

శ్లో. లగ్నే ఫణీ తదీశస్తు మానే పాపయుతో యది
చత్వారఃకుత్రచిద్వ్యక్తాద్విత్రిగర్భప్రసూతయః. 24

లగ్నముల రాహువు లగ్నాధిపతి పాపులతోఁగలసి దశమమందుండగా నేరాశియందైనను నాలుగుగ్రహములున్న జాతకునకు ఒకసారిగా నిరువురుముగ్వురుకంటె నెక్కుడుగా పిల్లలుగలుగుదురు.

శ్లో. రాహుణాకేతునావాపి యుత సూర్యోష్టమేయుతః
జాతస్యావమతింకుర్యాచ్ఛిరోముండనమేవావ. 25

రవిరాహుకేతువులలో నొకరితో నొకరుఁ గలసి 8 యింటనున్నయెడల జాతకుడు ముండనమాచరింపఁబడి యవమానింపబడును.

శ్లో. దేహేశౌచంద్రసౌమ్యౌచేత్ ఫణినా కేతునా యుతౌ
ఛాయానందనసందృష్టౌ శ్వేతకుష్ఠప్రదాస్మృతౌ. 26

బుధచంద్రులలో నొకరు లగ్నాధిపతులై రాహుకేతువులలో నొకరితోఁగలసి శనిచే చూడబడినయెడల జాతకుడు శ్వేతకుష్ఠుగలవాడగును.

శ్లో. లగ్నే శేనకుజస్సౌమ్యః కన్యామిధునసంస్థితః
సారోలగ్నేశ్వర సౌమ్యదృష్టోవా అసనామయః. 27

లగ్నాధిపతితో కుజబుధులలో నొకరుగలసి కన్యామిథునములలో నున్నను లగ్నాధిపతి కుజునితోఁగలసి బుధునిచే చూడబడినను జాతకుఁడాసనరోగముచే పీడింపబడును.

శ్లో. లగ్నేశే కేంద్రకోణస్థే స్వోచ్చమిత్రస్థితేపివా
గురుశుక్రేక్షితయుతే దేహసౌభాగ్యయోగవాన్. 28

లగ్నాధిపతి కేంద్రత్రికోణములయందుగాని యుచ్చయందుగాని మిత్రక్షేత్రములందుగాని యుండి గురుశుక్రుల దృష్టిగల్గియున్న యెడల జాతకుఁడు మంచిసౌభాగ్య మనుభవించును.

ద్వి తీ య భా వః.

శ్లో. నేత్రేశ స్తనునాయకేన సహితశ్చంద్రాన్వితోదుస్థలే
నేత్రఘ్న స్తనునాయకేన సహితో వామాక్షిహాదుఃస్థలే
లగ్నే శేసధనేశ్వరేశనియుతే జాత్యంధకోదుఃస్థలే
రిప్పేభానుసుతోక్షిహా నిగదితో వామాక్షిహాభూసుతః. 1

లగ్నద్వితీయాధిపతులు చంద్రునితోఁగలసి 6, 8, 12 స్థానముల నున్నయెడల జాతకునకు కండ్లుపోవును. లగ్నద్వితీయాధిపతులు 6,8,12 స్థానములందున్నను చంద్రునితోఁ జేరకున్నయెడల నెడమకన్నుగ్రుడ్డియగును. లగ్నద్వితీయాధిపతులు శనితోఁ గలసినను, శనిచే చూడబడినను జాతకుఁడు జాత్యంధుడగును. శని ద్వాదశమునయున్న నెడమకన్నుపోవును. కుజుఁడు ద్వాదశమందున్న నెడమకన్ను గ్రుడ్డిదగును.

శ్లో. చంద్రేభాస్కరసంయుతేక్షిభవనే లగ్నేధవా సప్తమే
శన్యంగారక వీక్షితేతు పురుషోనేత్రేణహీనోభవేత్
సౌమ్యక్రూరనిరీక్షణేర్కశశినోస్స్యాద్బుద్బుదాక్షోగురౌ
చంద్రేవాతనునేత్రగే ధవళదృగ్భానౌతురక్తాంతదృక్. 2

రవిచంద్రులిరువురును ద్వితీయసప్తములలో నొకదానియందుండి శనికుజులచే చూడబడినయెడల జాతకునికన్నులు పోవును. అట్టి

రవిచంద్రులకు శుభులయొక్కయు పాపులయొక్కయు దృష్టితగిలినయెడల జాతకుఁడు బుద్బుదనేత్రుఁడగును. గురుచంద్రులు కలసి లగ్నగతులైన యెడ జాతకుడు తెలికన్నులవా డగును. రవిగురులు లగ్నమందున్న జాతకునికంటికొలకుల రక్తిమయుండును.

శ్లో. ధనేశచంద్రసంయుక్తే విశాలధవళేక్షణః
రవిణాసంయుతే భూయాద్విశాలారుణలోచనః. 3

ద్వితీయాధిపతి చంద్రునితోఁ గలిసినయెడల తెల్లతామరలబోలు కన్నులుగలవా డగును. ద్వితీయాధిపతి సూర్యునితోఁ గలసిన యెఱ్ఱదనముగలకన్నులుగలవా డగును.

శ్లో. రిప్పేపాపఖగత్రయంధనగతే మందేరిపౌలగ్నపేం
ధస్స్యాత్కర్కిణిభానుజేరిపుఖగైర్యుక్తేథవావీక్షితే
నక్రస్థేప్యథభాస్కరే రిపుయుతే చంద్రేణయుక్తేక్షితే
జాతాంధోభవితేతినిశ్చితమిదం యోగత్రయంశాస్త్రతః. 4

ద్వాదశమున ముప్వురుపాపులును ద్వితీయమున శనియు, లగ్నాధిపతి 6 టను యున్న జాతకుడు జాత్యంధుఁడగును. శని కర్కాటకమున పాపులసంపర్కముగలవాడై యున్నయెడల జాతకుడంధుడగును. రవి చంద్రునితోఁ గలసి మకరమునసుండి పాపగ్రహసంపర్కము గల్గియున్న యెడల జాతకు డంధుఁడగును.

శ్లో. కోణేవిలగ్నే ఫణిపేథకర్మపే షష్ఠేఽపిరిప్ఫేప్యథవానీచే
లాభేశ్వరేరంధ్రగతేచశత్రుభేనీచేధనంచౌర్యకృతంలభేన్నరః

తా. లగ్నపంచమనవమముల రాహువున్నను, రాజ్యాధిపతి6,12 స్థానములనున్నను, నీచుడైనను, అష్టమాధిపతి నీచగతుడైనను చౌర్యముచే ధనమార్జించును.

శ్లో. నేత్రేశేప్యగృహేష్ఠమేసహాభవేత్స్వోచ్చేత్రికోణాలయే
కేంద్రేవాయదిసంస్థితే శుభఖగైర్యుక్తేథవావీక్షితే

జాతస్సౌమ్యవిలోచనో ధనయుతో విద్యాప్రవీణస్సుఖీ
రిష్ఫే నీచగృహేరిభేబలయుతే దృష్టేతుత్వ్యయః

ద్వితీయాధిపతి కేంద్రకోణములగాని 3, 8 స్థానములగాని, యుచ్ఛయందుగాని యుండి శుభగ్రహసంపర్కము గల్గియున్నయెడల మంచి నేత్రములును, ధనము, విద్యయుగల్గినవాడగును. ద్వితీయాధిపతి 6, 12 స్థానములగాని నీచయందుగానియున్నను, పాపులతో సంపర్కము గలిగి యున్నను జాతకుడు ధనమునకును, సౌఖ్యమునకును విద్యకును దృష్టికిని దూరగుడగును.

శ్లో. అనన్యయుక్తేధకుటుంబనాధేశోణొచ్ఛకేంద్రస్వగృహేకళత్రం
ఏకంశుభం, విత్తనవేశయుక్తఖేటాంకతఃస్యాద్వికళత్రసంఖ్యా

ద్వితీయాధిపతి యెవ్వరితోడను గలియక స్వక్షేత్రమునగాని స్వోచ్ఛయందుగాని కేంద్రకోణములయందుగాని బలయుతుడై యున్న యెడల జాతకునకు మంచికళత్ర మొక్కటేగలుగును. సర్వసాధారణముగా కుటుంబభాగ్యాధిపతులతో నెన్నిగ్రహములు కలియునో అన్నికళత్రములు కలుగుచుండును.

శ్లో. లగ్నే సమందేరవ్యారిక్షేత్రగేపాపమధ్యగే
శత్రుభిర్వీక్షితేయుక్తే భుజచ్ఛేదోభవిష్యతి. 8

మేషవృశ్చికసింహములలో నొకటి లగ్నమై యందుశనియుండ ద్వితీయవ్యయముల పాపగ్రహములున్నను లగ్నమును పాపగ్రహములు దిలకించినను జాతకునిభుజము శస్త్రములచే తెగును.

శ్లో. ధనేశ్వగే సోమయుతేచతుంగే కేంద్రేపివారాజితపాత్రమాహుః
తద్దైవదేవాసురపూజ్యయుక్తే జాతస్సమాప్నోతిసువర్ణపాత్రం.9

ధనాధిపతి ఉచ్ఛయగు కేంద్రముల చంద్రునిగలసియున్న జాతకుడు రజితపాత్రముల భుజించును. ద్వితీయాధిపతి బలులగు గురుశుక్రులతోఁ గలసిన బంగారుపాత్రల భుజించువాడగును.

శ్లో. భౌమకేత్వంతరేలగ్నేకర్తర్యాంశత్రుపాపయోః
హస్తచ్ఛేదోభవేన్నౄణామితి కేరలభాషితం. 10

లగ్నమున కుజకేతువులలో నొకరుండగా లగ్నాధిపతిపాపగ్రహములకుమధ్యనున్న జాతకుడు హస్తమును గోల్పోవునని కేరళమున జెప్పబడెను.

శ్లో. ద్వితీయపే స్వోచ్చసుహృత్త్రికోణకేంద్రస్థితేభోజనబుల్పమేన
క్రూరాలయేవారిపుభేత్రి షష్ఠనీచారిభేకేతుయుతేతిభుక్తిః 11

ద్వితీయాధిపతిబలుఁడై నిజయుచ్చయందుగాని కేంద్రకోణముల గాని యున్న జాతకుడు మితభోజనముచేయువాఁడగును ద్వితీయాధిపతి పాపస్థానములనున్నను, శత్రుగృహములనున్నను, నీచయందున్నను నమితముగా భుజించువాఁడగును.

శ్లో. ధనస్థానే శుభయుతే శుభగ్రహనిరీక్షితే
తదీశ్వరే శుభబలేనిక్షిప్త ధనలాభవాన్. 12

ద్వితీయాధిపతి శుభుఁడై శుభస్థానములనున్నను, శుభులతోఁగలసి శుభస్థానములనున్నను శుభగ్రహవీక్షణగల్గియున్నను ద్వితీయాధిపతి యున్న రాజ్యాధిపతి శుభుడై శుభస్థానములనున్నను జాతకునకు ధనలాభము గలుగును.

శ్లో. ద్వితీయతమలాభే శేష్వేకోవాకూరవర్జితః
కేంద్రత్రికోణగోయస్యసకాతోధనవాన్భవేత్. 13

లగ్నాధిపతి, ద్వితీయాధిపతి లాభాధిపులలో నొక్కఁడైనను పాపులసంపర్కము లేనివాఁడై బలుఁడై కేంద్రకోణములందున్న జాతకుడు ధనవంతుడగును.

శ్లో. ద్వితీయసప్తమాధీశౌశుభక్షేత్రేశుభాన్వితౌ
శుభగ్రహేన సంధృష్టౌ ద్వికళత్రేసుజీవితః. 14

ద్వితీయసప్తమాధిపతులు శుభగ్రహ సంపర్కము గలిగి శుభ స్థానములనుండి శుభులచే చూడబడినయెడల జాతకున కిరువురు భార్య లుండి వారిరువురును జీవించియేయుందురు.

శ్లో. సుతనేత్రేశ్వరౌయుక్తౌరిపుక్షేత్రసమన్వితౌ
రాహుదృగ్యోగతో జాతోమ్లేచ్ఛమూలాద్ధనం లభేత్. 15

ద్వితీయపంచమాధిపతు లిరువురును గలసి శతృక్షేత్రములం దుండి రాహువుచే చూడబడినయెడల జాతకునకు మ్లేచ్ఛులవలన ధన లాభము గలుగును.

శ్లో. ధనేశేబుధసంయుక్తే కేతునావీక్షితేయుతే
హేమరత్నాదిలాభస్స్యాదితి కేరళకీర్తితం. 16

ద్వితీయాధిపతి బుధునితోఁ గలసి కేతుసంపర్కము గలవాడై నచో జాతకుడు రత్నముల సంపాదించువాడగును.

## తృతీయభావము.

శ్లో. దుఃస్థానగాసోదరపాధభావాపాపేక్షితౌ సోదరభంగమాహుః
లాభస్థితేవాయదిసోదరేశేభ్రాతృస్థితేక్రూరఖగేపిసంతః॥ 1

సోదరస్థానాధిపతి 6, 8, 12 స్థానములగాని శత్రుక్షేత్రమునగాని నీచయందుగాని యున్న జాతకునిసోదరులకు నాశనముగలుగును. తృతీ యాధిపతి 11 ట నున్నను, తృతీయమున పాపగ్రహమున్నను, సోదర నాశనముగల్గును. భ్రాతృస్థానము, ఆస్థానాధిపతికుజుడు కుజుడున్న రాశ్య ధిపతి యీనలువురకును పాపగ్రహసంపర్కమున్న జాతకునకు సోదరు లుండరు.

శ్లో. తృతీయభావతన్నాధకుజత్రరాశిపాయది
పాపేక్షితాః పాపయుతా సత్ర్యభ్రాతానవిద్యతే

తృతీయస్థానము, తృతీయాధిపతి, కుజుడు కుజుఁడున్న రాశ్యధి పతి వీరు పాపులతో సంపర్కము గల్గియున్న సోదరులుండరు.

శ్లో. లగ్నేశ్వరేభ్రాతృపతౌబలాఢ్యే క్రూరాన్వితేభూ
మిజచంద్రయోగే । మాతుస్సపత్న్యాస్తనయా
భవంతి లాభాధిపేవాథ తదీశలాభే॥

లగ్నతృతీయాధిపతులలో నొక్కరుబలయుతుఁడై పాపులతోఁగల
సియున్న సవతిసోదరులుండరు. చంద్రకుజులుకలసినను, లాభాధిపతి తృతీ
యాధిపతికి 11 ట నున్నను సవతిసోదరులుందురు.

శ్లో. భాతృస్థానాధిపేస్వోచ్ఛ మిత్రకేంద్ర త్రికోణగే
శుభేక్షితే శుభైర్యుక్తే భాతృవృద్ధి ముదీరయేత్

తృతీయస్థానాధిపతి స్వోచ్ఛమిత్రక్షేత్రస్వక్షేత్రములగాని కేంద్ర
ములగాని, కోణములగాని యున్నను శుభులతోఁ గలసినను, శుభులచే
చూడబడినను సోదరవృద్ధి యుండును.

శ్లో. భ్రాతృస్థానాధిపే స్వోచ్చే ధర్మకర్మపవృగ్యుతే
భాతౄణాం భాగ్యసంపత్తిరితి కేరళనిర్ణయః.

తృతీయాధిపతి యుచ్ఛస్వక్షేత్రములలో నొకయింటనుండి శుభు
లచే చూడబడిన సోదరులకు ధనసంపదకలుగును. తృతీయాధిపతి 3 ట
నున్నను, 9, 10 స్థానాధిపతులతో జేరియున్నను తృతీయాధిపతి 3 ట
నుండి, 9, 10 స్థానాధిపతులచే జూడబడినను జాతకునిసోదరులు ధన
వంతులగుదురు.

శ్లో. గ్రీవస్థైః ఫణిభూమిజధ్వజసితైశ్శూరాగ్రణి ర్భాతలే
చంద్రాదిత్యబుధై స్తృతీయకలితై ర్భీతశ్చలుబ్ధోభవేత్.
దుశ్చిక్యస్థితిశాలినా రవిసుతేనాపీంద్రపూజ్యేనచ
స్యాదౌదార్యసుకీర్తి బుద్ధికలితోజాతో బలిష్ఠైః ఖగైః.

తృతీయమున కుజరాహుకేతు శుక్రులున్న జాతకుడు శూరుఁ
డగును. 3 ట రవిబుధచంద్రులున్న పిరికివాడును లోభియునగును. 3 ట

గురుశనులున్న యెడల ఔదార్యాదికములు గలుగును. తృతీయమున బలుఁడైన గ్రహముండుటమంచిది.

శ్లో. సోదరేశయుతే భౌమే శుభదృష్టే బలాన్వితే
అంశేష్వపి చ తద్యోగే రాజమూలా ద్ధనాగమః.

తృతీయాధిపతి రాశియందు కుజునితోఁగలసి శుభసంపర్కముగల వాఁడై అంశలో కుజునితోఁజేరిన జాతకునకు రాజువలన ధనముచేకూరును.

శ్లో. జీవార్కరాహుభిర్యుక్తై తృతీయే సతి జన్మని
అండరోగోభవే న్నౄణామేష కేరళనిర్ణయః.

తృతీయమున రవి గురు రాహులుచేరిన జాతకు డండరోగియగు నని కేరళమున చెప్పబడియెను.

శ్లో. తృతీయే పుంగ్రహోపేతే పుందృష్టే పురుషోనుజః
స్త్రీగ్రహేణాన్వితే దృష్టే జాయతే తస్యచానుజాః.

తృతీయమున పురుషగ్రహములున్నను, పురుషగ్రహము లాస్థానమును జూచినను సోదరులుందురు. అందు స్త్రీగ్రహంబులున్నను, ఆ స్థానమును స్త్రీగ్రహములు జూచినను అక్కచెల్లెండ్రుందురు.

శ్లో. భ్రాతృస్థానాధిపే షష్ఠాష్టమవ్యయపసంయుతే
షష్ఠాష్టమవ్యయస్థేవా ధైర్యహీనో భవేన్నరః.

తృతీయాధిపతి 6, 8, 12 స్థానములనున్నను, ఆస్థానముల అధిపతులతో గలసినను జాతకుడు ధైర్యహీనుఁ డగును.

శ్లో. బలాన్వితే తృతీయస్థే భానౌ విక్రమవాన్ భవేత్
విలోక్యచక్రే ప్యేవం హి జ్యేష్ఠభ్రాతాదినిర్ణయః.

తృతీయమున రవి బలవంతుఁడై యున్నమాత్రమున జాతకుడు పరాక్రమవంతుడగును. 11 స్థానమునుబట్టి జ్యేష్ఠసోదరుల స్థితిగతుల తర్కింపవలయును.

## చతుర్థభావము.

శ్లో. స్మరేశే కేంద్రకోణస్థే ప్యథవా శుక్రసంయుతే
వాహనేశే తథా ధర్మే వాహనాద్యభివృద్ధివాన్.

సప్తమాధిపతి కేంద్రకోణములనున్నను, శుక్రునితో గలసినను చతుర్థాధిపతి 10 ట నున్నను జాతకుడు వాహనయోగము గలవాడగును.

శ్లో. ధర్మాధిపే వా కర్మేశే వాహనస్థే చ దర్శిని
వాహనాధిపయుక్తేవా వాహనాద్యభివృద్ధిమాన్.

9, 10 స్థానాధిపతులు వాహనస్థానమును జూచినను, లేక యా వాహనస్థానముననున్నను, వాహనస్థానాధిపతితో గలసినను జాతకునకు వాహనలాభముండును.

శ్లో. లగ్నేశే యది వాహనే తదధిపే లగ్నేథవా సంస్థితే
ప్రోక్తం వాహన ముత్తమం కవిగురూ తద్వచ్చతుర్థస్థితౌ
జామిత్రే గురుసోమనందనసుతా య ద్వాహనేశే క్షితౌ
జాతోభాగ్యయుతోశ్వదంతి రథవాహాందోళికాయాంసుఖీ.

లగ్నాధిపతి చతుర్థమందును చతుర్థాధిపతి లగ్నమందును యున్న యెడల జాతకునకు వాహనయోగము గలుగును. గురుశుక్రులు 4 ట నున్నను, 7 ట బుధ గురు శుక్రులలో నొకరైననుండి వాహనాధిపతిచే చూడబడినయెడలను వాహనయోగము గలుగును.

శ్లో. వాహనేశే తథా రమ్యే పరమోచ్చం గతే యది
ద్వితీయాధిపసంయుక్తే వాహనం లభతేనరః.

చతుర్థాధిపతి దశమమందుగాని పరమోచ్చయందుగాని ద్వితీయాధిపతితో గలసియున్నయెడల జాతకునకు వాహనసౌఖ్యముండును.

శ్లో. చంద్రం పశ్యతి భార్గవో యది భవే చ్చంద్రా త్తృతీయే భృగు
శ్చుక్రా ద్వక్రనుసంస్థితో యది శశీ చాందోళికావాహనం

జీవోవా భృగుజోథవా యది కళత్రేశాన్విత స్తద్భవే
న్నేత్రేశేన చ ధర్మపో గృహపతి ర్వా తద్వదేవస్థితః.

చంద్రుఁడు శుక్రునిచే చూడబడినను, చంద్రునకు తృతీయమున శుక్రుడున్నను, శుక్రునకు తృతీయమున చంద్రుడున్నను, గురుశుక్రులకు తృతీయమున చంద్రుడున్నను, గురుశుక్రులలో నెవ్వరికైన సప్తమాధిపతి సంబంధమున్నను, భాగ్యాధిపతి ద్వితీయాధిపతితో గలసినను, చతుర్థాధిపతి భాగ్యాధిపతితో గలసినను వాహనాధిపతి భాగ్యాధిపతికి తృతీయముననున్నను జాతకునకు వాహనయోగము గల్గును.

శ్లో. తృతీయే హిబుకే చంద్రే శుభగ్రహాయుతే క్షితే
ఉచ్ఛస్థే ధర్మపయుతే తురంగఛత్రసంయుతః.

చంద్రుడు లగ్నమునగాని తృతీయమునగాని శుభులతోగలసి శుభులచే చూడబడుచు బలుఁడైనయెడల జాతకునకు వాహనయోగము గలుగును. చంద్రుడు రాజ్యాధిపతితోగలసి యుచ్ఛయందున్న జాతకునకు అశ్వవాహనము లభించును. ఛత్రయోగము గల్గును.

శ్లో. వాహనాధిపతౌ తుంగే కారకేణ సమన్వితే
త్రికోణలాభకేంద్రస్థే వాహనాద్యభివృద్ధిమాన్.

చతుర్థాధిపతి యుచ్ఛయందున్నను, గురునితో గలసి 1, 4, 5 7, 9 స్థానములగాని దశమమునగాని లాభమునగాని యున్న వాహనాభివృద్ధిగల్గును.

శ్లో. వాహనాధిపతౌ నీచే కారకేతు బలాన్వితే
కేంద్రత్రికోణలాభస్థే వాహనస్థ శ్చరేత్సదా.

వాహనాధిపతి నీచుఁడైనను గురుఁడు బలుఁడై యుండ చతుర్థాధిపగురులలో నొక్కరు కేంద్రకోణలాభముల నున్నయెడల జాతకుఁ డెల్లప్పుడును వాహనమునెక్కి తిరుగును.

శ్లో. బంధ్వీక్షకే స్థితే భౌమే బహుక్షేత్రార్జకో భవేత్
చతుర్థే భాగ్యరాజ్యేశౌ ద్రష్టారౌ భూవిధాయకౌ.

చతుర్థమున కుజుడున్నను, చతుర్థమును కుజుడు చూచుచున్నను జాతకుడు భూముల నార్జించునా డగును. భాగ్యరాజ్యాధిపతులు చతుర్థమందున్నను చతుర్థమును చూచిననుగూడ భూసంపాదన గలవాడగును.

శ్లో. చతుర్థేశయుతః క్రూరశ్చతుర్థే వా భవేద్యది
మాతృకారకపాకేతు మాతృనాశం వినిర్దిశేత్.

చతుర్థాధిపతి పాపులతోజేరినను చతుర్థమున పాపులుండినను, మాతృకారకదశయందా పాపగ్రహభుక్తియందుగాని యా పాపగ్రహ మహాదశయందు మాతృకారకదశయందు భుక్తియందుగాని మారకము గలుగును.

శ్లో. కారకే మాతృరాశిస్థే పతౌ వా కారణాన్వితే
సప్తమాధిపసంయోగే తత్పాకే మాతృనాశనం.

మాతృకారకుడు చతుర్థాధిపతితో జేరినను మాతృకారకుడు చతుర్థమందున్నను, సప్తమాధిపతి దృష్టివలన వారివారి దశలయందు మాతృమారకము జరుగును.

శ్లో. చతుర్థసప్తమాధీశౌ షష్ఠాష్టమవ్యయస్థితౌ
క్రూరగ్రహేణ సంయుక్తౌ మూత్రకృచ్ఛ్రప్రదౌ స్మృతౌ

చతుర్థాధిపతి సప్తమాధిపతులు కలసిగాని ప్రత్యేకముగాగాని 6, 8, 12 స్థానముల పాపులతోగలసి యున్నయెడల మూత్రకృచ్ఛ్ర రోగము గలుగజేయుదురు.

శ్లో. ధర్మస్థానాధిపే భాగ్యే శుభగ్రహసమన్వితే
వాహనాధిప సంయుక్తే జాతో వాహనసౌఖ్యభాక్

చతుర్థభాగ్యాధిపతులు భాగ్యమందుండి శుభగ్రహసంపర్కము గలవాడై యున్న జాతకునకు వాహనసౌఖ్యము కలుగును.

శ్లో. నిధనేశయుతే భౌమే లాభరాశ్యధిపే సతి
మాతృకారకసందృష్టే ద్వైమాత్రో భవతి ధృవం.

కుజుడు లాభాధిపతియై అష్టమాధిపతితోఁగలసి మాతృకారకునిచే చూడబడిన జాతకు డిద్దరుతల్లులుగలవా డగును.

శ్లో. కుజే లాభాధిపే చైవ దివాకరసమన్వితే
రాహుయుక్తే భవా దృష్టో జననీ తస్యజారిణీ.

కుజుడు లాభాధిపతియై సూర్యునిగలసి రాహుసంపర్కము గలవాడైనచో జాతకునితల్లి జారిణియగును.

శ్లో. హిబుకేశే స్థితే లాభే లాభాధీశసమన్వితే
బంధుభూవాహనాప్తిం చ మాతృసౌఖ్య మవాప్నుయాత్.

చతుర్థాధిపతి లాభాధిపతితోఁగలసి లాభమందుండెనేని జాతకుడు బంధుభూమి వాహన మాతృసౌఖ్యములు గలవాడగును.

శ్లో. బంధుస్థానాధిపే జీవే శుభక్షేత్రసమన్వితే
బంధువృద్ధి ర్భవే న్నౄణా మితి కేరళనిర్ణయః.

చతుర్థాధిపుడైన గురుడు శుభులయొక్క రాశులయం దుండెనేని జాతకునకు బంధువృద్ధి గలుగునని కేరళమున జెప్పబడెను.

శ్లో. చతుర్థేశయుతే పాపే త్వరిష్టస్థాన మాశ్రితే
మూఢబుద్ధి ర్భవే జ్జాతః కేరళానా మిదంమతం.

చతుర్థాధిపతి పాపులతోఁగలసి 6, 8, 12 స్థానములనున్న జాతకుడు మూఢుడగును.

శ్లో. జలేశే స్వోచ్చరాసిస్థే నిధనేశసమన్వితే
లగ్నాధిపేన సంధృష్టో జలశ్రమయుతో భవేత్.

చతుర్థాధిపతి అష్టమాధిపతితోఁగలసి నిజోచ్చయందుండి లగ్నాధిపతిచే చూడబడినయెడల జాతకుడు నీటిగండము గలవాడగును.

శ్లో. జాతిస్థానాధిపే లగ్ననాధస్యోపచస్థితే
ధర్మ కర్మపసంయుక్తే జాతి శ్రేష్ఠాంశగేపివా.

చతుర్థాధిపతి లగ్నాధిపతికి 3, 6, 10, 11 స్థానములనుండి ధర్మ కర్మాధిపతుల రాజ్యాంశయందుగూడిన జాతకుడు జాతిశ్రేష్ఠుడగును.

శ్లో. పాతాళేశే రాహుయుక్తే పాతాళే మందసంయుతే
తౌ దృష్టౌ గురుశుక్రాభ్యాం జాతో భూమిగృహే వసేత్.

చతుర్థాధిపతి రాహువుతోగలసియుండి చతుర్థమున శనియుండి చతుర్థాధీశులను గురుశుక్రులు చూచిరేని జాతకుడు పాతాళగృహమున దాగియుండువాడగును.

## పంచమభావము.

శ్లో. ద్వారేశే వ్యయషష్టమృత్యుకలితే శత్రుగ్రహాఃపార్శ్వయో
ర్వంధ్యాయోగ ముశంతి పంచమపతౌ నేత్రాధిపే వా తథా।
పుత్రేశే రిపుశత్రునీచగృహగే ధర్మే చ పాపగ్రహాః
పుత్రో నాస్తి సుతేశ్వరే బలయుతే స్రావాఖ్యదోషో భవేత్.

2, 5, 7 స్థానముల కధిపతులు 6, 8, 12 స్థానములందుండి వారికిరుపార్శ్వంబుల పాపులున్న యెడల జాతకునకు సంతతియుండదు. పంచమాధిపతి శత్రునీచక్షేత్రములందు డి నవమమున పాపగ్రహము గాని పాపులుగాని యున్న జాతకునకు సంతతియుండదు. పంచమాధిపతి క్రూరులతో గలసియున్న జాతకునిభార్యకు గర్భస్రావము గలుగును.

శ్లో. సుతధర్మేశ్వరౌ చోభౌ వన్యోన్య మభివీక్షితౌ
వంధ్యాయోగ ఇతి ప్రోక్తః కేరళానాం మతేబుధైః.

పంచమ నవమాధిపతులు ఒకరినొకరు చూచుకొనుచున్న జాతకు డపుత్రకు డగునని కేరళమున జెప్పబడియెను.

శ్లో. పుత్రస్థానగతే చ సూర్యతనయే సంతాననాశో ధృవం
భానా వేకసుతః కుజే సుతయుగం దుష్టంచ నష్టంక్వచిత్

జీవే పుత్రచతుష్టయం గుణయుతం శుక్రే చ రాహౌ పరైః
కేతౌ స్త్రీసుతనాయకే బలయుతే జీవే దపత్యం చిరాత్.

పంచమమున శనియున్న జాతకునకు సంతానన ష్ట మెక్కువగా నుండును. అందు రవియున్న జాతకునకు ఒక్కకుమారుడుండును. కుజుడున్న నిరువురు కుమారులుందురు. కొంతసంతానముగూడ నశించును. గురుఁడున్న గుణయుతులైన నలువురు కుమాళ్ళుందురు. రాహువున్న యితరులవలన సంతానము గలుగును. కేతువున్న స్త్రీసంతాన మధికముగానుండును. పంచమాధిపతి బలుడైన సంతానము చిరకాలము జీవించును.

శ్లో. పుత్రేశే పురుషగ్రహేణ సహితే త్వాదౌ పుమాన్జాయతే
శుక్రేంద్వర్కజరాహుభి శ్చ సహితే స్త్రీ జాయతే చాగ్రతః
సౌమ్యే నాథయుతే తు పుత్రజనితః పుత్రీజని శ్చోభయం
జీవ శ్చే న్నవమంతు పశ్యతి తదాపుత్రోద్భవో నిశ్చయాత్.

పంచమాధి తి రవికుజగురులతో జేరిన ముందు పురుషసంతానమును, శనిరాహువులతో జేరిన ముందుగ స్త్రీసంతానమును గలుగును. బుధుఁడు పంచమాధిపతితో జేరినజాతకునకు పురుషశిశువునకు పిమ్మట స్త్రీశిశువు గలుగును. ఒక్కొక్కచో ముందుగా నాడపిల్ల గలుగుట గూడ గలుగును. గురుడు భాగ్యమును చూచిన జాతకునకు పురుషసంతానము తప్పక కలుగును.

శ్లో. పుత్రేశే స్మరసంస్థితే నవమనాథేనాన్వితే కర్కటే
కన్యాతౌళివృషస్థితే శశితమశ్శుక్రేక్షితే వా యుతే
ఆదౌ స్త్రీపురుషాలయస్థితియుతే పుందృష్టియుక్తే పుమాన్
జీవే పంచమగే ధవా తనుగతే పుత్రో భవే న్నిశ్చయాత్.

పంచమాధిపతి 7 ట నున్నను, నవమాధిపతితో గలసినను, వృషభకర్కట కన్యాతులలనున్నను ముందు స్త్రీసంతానమును, పంచ

మాధిపతి శుక్ర చంద్రరాహువులతో గూడినను వారిచే చూడబడినను ముందుగ స్త్రీసంతానమును, పంచమాధిపతి పురుషగ్రహరాశియందున్నను పురుషగ్రహసంపర్కము గల్గినను జాతకునకు ముందుగ పురుషసంతానము గలుగును. గురుఁడు లగ్నముననున్నను పంచమముననున్నను ముందుగ పురుషసంతానము గలుగును.

శ్లో. పుత్రేశే తనుపాన్వితే సుతగృహస్థే చంద్రయుక్తే క్షితే
త్వేకః పుత్ర ఉదేతి సౌమ్యసహితే ద్వౌ శుక్రయుక్కన్యకా
పుత్రీ పుత్రయుగం చ దేవగురుణాయుక్తే ధదే త్కేతునా
కన్యైవేతి వినిర్ణయో నిగదితో గోపాలరత్నాకరే.

పంచమాధిపతి లగ్నాధిపచంద్రులతో పంచమమున నుండినను, పంచమముననుండి చంద్రునిచే చూడబడినను ఒకకుమారుఁడు గలుగును. లగ్నపంచమాధిపతులు పంచమమునుండి బుధసంపర్కము గల్గియున్న నిరువురు కుమారులుందురు. శుక్రుని సంపర్కమున్న కుమార్తె కలుగును. గురుసంపర్కమున్న పుత్రుడును పుత్రికయు జన్మింతురు. కేతువున్న స్త్రీసంతానము కలుగును.

శ్లో. కేంద్రస్వోచ్చగృహాశ్రితే సుతపతౌ మిత్రాలయే లాభగే
సౌమ్యైస్సంయుతవీక్షితే చ పురుషస్సంతానసౌభాగ్యవాన్
ధర్మస్థే శుభఖేచరే సుతభవో భౌమే స్థితే స్ఫోటకం
రాహౌ దేశపరిభ్రమో నవమగే వాతోద్భవా వ్యాధయః.

పంచమాధిపతి కేంద్రములగాని 21 ట గాని, స్వక్షేత్రమునగాని, మిత్రక్షేత్రమునగాని యుచ్ఛయందుగాని శుభులతో గూడియున్నను, శుభులచే చూడబడుచున్నను, జాతకునకు పుత్రులు కలుగుదురు. నవమమున శుభగ్రహమున్న సంతానములేదు. కుజుడున్న స్ఫోటకపడును; రాహువున్న దేశాటనచేయును. శనియున్న వాతపీడితశరీరుఁడగును.

శ్లో. పంచమస్థే రవౌ చంద్రే లాభస్థానగతే యది
లగ్నేశపంచమాధీశక ర్తర్యాం బంధనం భవేత్॥

రవి పంచమమునందుండ లాభమున చంద్రుఁడుండుట బంధకయోగము, లగ్నపంచమాధిపతులలో నెవ్వరైన పాపార్గళదోషముగలవారైన నది యొక బంధక యోగము.

శ్లో. పంచమే సప్తమే క్రూరే తదీశే శత్రుమందిరే
క్రూరక్షేత్రగతే వాపి కుక్షిహృచ్ఛూలసంభవః.

పంచమమునగాని సప్తమమునగాని పాపులుండి యాస్థానాధిపతులు క్రూరగ్రహముల క్షేత్రములందుగాని శత్రుక్షేత్రమందుగాని యున్నయెడ జాతకుఁడు హృదయశూల గలవాడగును.

శత్రుభావము.

శ్లో. షష్ఠస్థానకుజే రాహౌ బృహద్వృషణతా భవేత్
తౌ సప్తమే స్థితౌ యస్య భార్యా కుసుమరోగిణీ.

6 వ యింట కుజరాహువులున్న జాతకుఁడు వరిబీజము, బుడ్డ గలవాడగును. సప్తమమున కుజరాహువులున్న జాతకునిభార్య కుసుమ వ్యాధి గలదగును.

శ్లో. షష్ఠేశే సప్తమేశే వా ధ్వజయుక్తనిరీక్షితే
రక్తకాసో భవే న్నౄణా మితి కేరళనిర్ణయః.

షష్ఠాధిపతియు సప్తమాధిపతియు కేతువుతో గలసినను, లేక కేతువుచే చూడబడినను జాతకుడు కాసరోగపీడితుడగునని కేరళమున జెప్పబడియెను.

శ్లో. షష్ఠే శుభఖగై ర్యుక్తే తదీశేన నిరీక్షితే
శత్రువృద్ధి ర్భవే న్నౄణాం పాపే శత్రువినాశనం॥

శత్రుస్థానమున శుభులున్నను షష్ఠాధిపతి యాస్థానముననే యుండినను లేక యాశత్రుస్థానమును షష్ఠాధిపతి జూచినను జాతకునకు శత్రు

వృద్ధి గలుగును. పాపులు ఆరింటనున్నను, ఆరింటిని పాపులుచూచినను శత్రుక్షయము గలుగును.

శ్లో. రాహావష్ఠగతే తు సర్పజభయం మందే జ్వరై స్తస్కరై
ర్భామే చాననజా రుజ శ్శశిని చే ద్గండో జలే పాతతః
జీవే దీర్ఘరుజో బుధే తు వికృతి శ్చిత్తస్య పిత్తోద్భవా
శుక్రే దారకలి శ్చ తుంగసహితే నాథే తు తత్ జ్ఞాతిభి.

షష్ఠమున రాహువున్న సర్పగండము గలుగును. శనియున్న జ్వర పీడితదేహుఁడగును. కుజుఁ డారింటనున్న మూలవ్యాధి గలవాడగును. గురుడున్న దీర్ఘరోగియగును. బుధుడున్న పైత్యరోగముగలవాడగును. శుక్రుడున్న భార్యతో కలహించువాడగును. శత్రుస్థానాధిపతి యుచ్ఛ యందున్న జ్ఞాతివృద్ధిగలవాడగును.

శ్లో. షష్ఠేశే నవమాధిపేన ఫణినా యుక్తే ధవా కేతునా
నీచస్త్రీనిరతో ర్కజేన భవితా శూద్రీరతో పైశ్యజాం
సౌమ్యే నైతిచవిప్రజాంగురుభృగుభ్యాంభానునాక్షత్రియాం
ద్యూనే రాహుగురూ తథా ధనగతౌ చండాలసంసర్గదా.

శత్రుస్థానాధిపతి నవమాధిపతితోగాని, రాహుకేతువులతోగాని కలసినయెడల నీచస్త్రీసాంగత్యము చేయువాడగును. శత్రుస్థానాధిపతి శనితోగలసిన శూద్రస్త్రీని, బుధునిగూడిన వైశ్యస్త్రీని, గురుశుక్రులతో జేరిన బ్రాహ్మణవనితలను సూర్యునితో జేరిన క్షత్రియస్త్రీని కలయువాడగును. ద్వితీయసప్తముల నెందైన గురురాహువులున్న జాతకునకు చండాలసంపర్కముగూడ గలుగును.

శ్లో. షష్ఠస్థానాధిపే ధర్మే పాపగ్రహసమన్వితే
శత్రుభిః పీడ్యతే జాతః స్వల్పభాగ్య మవాప్నుయాత్.

షష్ఠాధిపతి నవమమునందు క్రూరగ్రహయుక్తుడై యున్న జాతకునకు శత్రువృద్ధియు అల్పభాగ్యముండును.

శ్లో. కుజార్కి ఫణిభి ర్యుక్తే షష్ఠే స్యా దండరోగభాక్
గురురాహుద్వయం లగ్నే యది వాండభవామయః.

షష్ఠమందు కుజశని రాహువులు కలిసియున్న జాతకు డండ రోగము గలవాడగును. లగ్నమున గురురాహువులు గలసియున్న అండ రోగముగలుగును.

శ్లో. షష్ఠాధీశే సప్తమస్థే స్ఫోటకం కుజవీక్షితే
రాహ్వీక్షితేంగవైకల్యం కేతుయోగే తు కుష్ఠతా.

షష్ఠాధిపతి సప్తమమునందుండి కుజునిచే చూడబడిన జాతకుఁడు స్ఫోటకపడును. అట్టిషష్ఠాధిపతిని రాహువు దిలకించిన జాతకుడు అంగ వైకల్యముగలవాడగును. కేతువు దిలకించిన జాతకుడు కుష్ఠురోగి యగును.

సప్తమ భావము.

శ్లో. కళత్రగతే భూమిసుతే చ రాహౌ భ్రష్టో భవే దన్యకులప్రవేశాత్
గుర్వేందుదృష్టే తు భవే ద్విశుద్ధి ర్యోగే సదాచారతో హి జాతః

సప్తమమున కుజరాహు లున్నజాతకుడు ఇతరకులమువారితో సంపర్కముగల్గి జాతిభ్రష్టుడగును. సప్తమమున కుజరాహులుండి గురుని చేతను చంద్రునిచేతను చూడబడిన జాతిభ్రష్టుడయి ప్రాయశ్చిత్తాదికముల శుద్ధుఢగు. గురుచంద్రులు శుభులై సప్తమమందుగాని నవమమందుగాని యున్నజాతకుఁ డాచారవంతుడగును.

శ్లో. సప్తమేశయుతే భౌమే రాహుణా చ నిరీక్షితే
భృగుణా సంయుతే దృష్టె కళత్రం భ్రష్ట మాదిశేత్.

కళత్రాస్థానాధిపతి కుజరాహువులతోగలసి శుక్రునిచే చూడ బడినను, సప్తమాధిపతి, కుజుడు రాహువు శుక్రుడు వీరుగలసియున్నను జాతకునిభార్య భ్రష్టురాలగును.

శ్లో. జామిత్రే గురుచంద్రవీక్షితయుతే రమ్యా భవే దంగనా
మందేనాధ కురూపదుష్టవనితా వృద్ధా చ పత్నీ భవేత్
ఆదిత్యేనచ చంద్రజేన చ భవే దన్యాంగనాసంగమో
భౌమేనాపి సితేనకామవశగః కాంతానుభోగంలభేత్

కళత్రస్థానమున గురుచంద్రులలో నొకరున్న జాతకునకు సౌందర్యవతియగు భార్యలభించును. సప్తమమున శనియున్న కురూపిణియు, ముసలియు యగు భార్యలభించును. సప్తమమున రవిబుధులున్న జాతకుఁడు పరస్త్రీసంగమము చేయువాడగును. సప్తమమున కుజశుక్రులున్న జాతకుఁడు కామియై పెక్కుమంది స్త్రీలతో గూడు వాడగును.

శ్లో. దారేశే గురుసంయుతే సుతపయుక్తే చాపి పత్నీద్వయం
సంతానప్రద మేవ భోగసహితం స్యా ద్రాహుమందాన్వితే
భార్యాద్యామృతసూస్త్వితీయసుదతీ స్రావాన్వితాతద్వదే
వాన్యా చోభయగే సితే ఫణియుతే స్రావశ్చ భౌమాన్వితే.

సప్తమాధిపతి గురునితోగాని పంచమాధిపతితోగాని గలసియున్న ద్వికళత్రయోగముగలుగును. సప్తమాధిపతి శనిరాహువులతో గూడిన జాతకునకు మూడువివాహములగును. ప్రథమభార్యకు సంతానముగల్గి నష్టమగుటయు, ద్వితీయభార్యకు గర్భస్రావములు గలుగుటయు తృతీయభార్యకును గర్భస్రావములు గలుగుటయు నగును. శుక్రుఁడు చరస్థిరస్వభావరాశియందు కుజరాహువుల గూడియున్న జాతకుడు ముప్పురుభార్యలు గలవాడగును.

శ్లో. శుక్రే చ స్థిరసంస్థితే తు రవిసౌమ్యాభ్యాం కళత్రద్వయం
చాద్యం సంతతిలాభనాశకలితం సంతానయుక్తం పరం
శుక్రే చ స్థిరగే ధ్వజేక్షితయుతే సంతానదా రక్షతి
స్యా దాద్యా త్రిసుతా ద్వితీయసుదతీపుత్ర్యన్వితే జ్యేష్ఠితే.

శుక్రులు రవిబుధులతో గలసి స్థిరరాశియందున్న జాతకునకు ద్వికళత్రయోగము గలదు. అందు ప్రథమభార్యకు సంతానముగల్గి నష్టమగును. ద్వితీయభార్యకు సంతానవృద్ధి యుండును. శుక్రుడు రవిబుధులతో జేరి స్థిరగతుండై నను శుక్రుడు కేతువుచే చూడబడినను సంతానమునకు నష్టముకలుగును. శుక్రునకు గురుదృష్టియున్న మొదటిభార్యకు ముప్వురుకుమారులును ద్వితీయభార్య కిరువురు కుమార్తెలునుయుందురు.

శ్లో. దారేశేవ్యయశత్రుపాపకలితే పాపగ్రహేణాన్వితే
క్రూరారాంతరగే చ నీచభవనే సూర్యాస్తగే వా యది
పుణ్యేప్తి చ పాపవీక్షితయుతే లగ్నాధిపేద్వాదశే
కర్మస్థే బలవత్యథో తమసి చేల్లాభేపి దారద్వయం.

సప్తమస్థానాధిపతి పాపులతో జేరి లేక పాపులచే చూడబడి, షష్ఠాష్టమవ్యయస్థానముల నున్నను సప్తమాధిపతి యస్తంగతుండై నను నీచయందున్నను జాతకుడు ద్వికళత్రయోగము గలవాడగును. సప్తమాధిపతి నవమమున పాపులతోగలసియున్నను, పాపులచే చూడబడుచున్నను, లగ్నాధిపతి వ్యయమందున్నను, ద్వికళత్రయోగము, రాహువుపూర్ణబలుడై లాభమందుగాని వ్యయమందుగాని యున్న నదియొక ద్వికళత్రయోగము.

శ్లో. జామిత్రేధనరంధ్రరిష్ఫ జలగే భౌమే ధవా భార్గవే
పాపైః దృష్టియుతే చరే యది భవే ద్దారద్వయంనిశ్చితం
శుక్రే జీవసమన్వితే ద్వయ మథో దారేశ లగ్నస్థితౌ
పూర్వా శ్యామలదీర్ఘతుందిలతమః కుబ్జా సురూపోత్తరా.

కుజుడు ద్వితీయ చతుర్థ సప్త మాష్టమ స్థానముల నున్నను, శుక్రుడు చరరాశిలో పాపులతో గలిసియున్నను, శుక్రుడు చరరాశిలో నుండి పాపులచే చూడబడినను ద్వికళత్రయోగము; చరరాశిరో పాపసంపర్కము గల్గిన శుక్రుడు గురునితో గలసియుండగా సప్తమాధిపతి

లగ్నమున నున్నపుడు జాతకుని ప్రథమకళత్రము నల్లని దీర్ఘశరీరముగల దగును. ద్వితీయభార్య పొట్టిదిగను సొగసుగను యుండును.

శ్లో. తుంగేస్మరేశే స్మరగేశుభగ్రహేతౌ శుక్రయుక్తౌయదిశుక్రదృష్టౌ
భార్యాస్త్వనేకాఅథశుక్రమందరాహ్వాన్వితస్త్వేఖలు నీచకామః.

సప్తమాధిపతి యుచ్ఛయగు సప్తమమున శుభులతో గలసియుండగా నా సప్తమాధిపతిని శుక్రుడు చూచినను, లేక యట్టి సప్తమాధిపతితో శుక్రుడు కలసియున్నను జాతకున కనేకమంది భార్యలుందురు. సప్తమాధిపతికి శని రాహువులతో గలియుటగాని శని రాహువులచే చూడబడుటగాని గల్గిన జాతకుడు జారుడగును.

శ్లో. కళత్రేశః కుటుంబేశో యావద్గ్రహసమన్వితః
శుక్ర శ్చ తేషు వీర్యాఢ్య స్సంఖ్యాకం తత్కళత్రకం.

కుటుంబకళత్రాధిపతులతోడను శుక్రునితోడను యెన్నిగ్రహములు జేరియుండునో యాచేరిన గ్రహములలో యెందరుబలవంతులో జాతకునకందరు భార్యలుందురు.

శ్లో. ద్వారేశ్వరే వాధకుటుంబనాధే పాపాన్వితే పాపనిరీక్షితేవా
యదాశ్రిత స్తత్పతివీర్యహీనౌజాతస్తుభార్యాంతరమేతినూనం.

ద్వితీయసప్తమాధిపతులలో నేరికైనను పాపగ్రహసంపర్కము గల్గినను యా ద్వితీయసప్తమాధిపతులున్న భావాధిపతి బలహీనుడైన యెడల జాతకుడు ద్వితీయభార్యను స్వీకరించును.

శ్లో. చతుర్థే త్వేకఖేటాఢ్యే దారేశే రాహుసంయుతే
పాపగ్రహేణ సందృష్టె జారయోగో న సంశయః.

చతుర్థమున నొకగ్రహముండగ సప్తమాధిపతితో రాహువుగలిసి యుండగ పాపులు సప్తమాధిపతిని జూచినను జాతకుడు వ్యభిచారి యగును.

శ్లో. కుటుంబకర్మేశ్వరదారనాథైస్సమన్వితై ర్జారముదాహరంతి
అగ్నాధిపే పాపయుతే చ దృష్టేజారః పరస్త్రీషుకువర్తనగశ్చ.

ద్వితీయసప్తమ కర్మాధిపతులు కలసియున్న జాతకుడు జారుడగును. లగ్నాధిపతి పాపగ్రహసంపర్కము గలవాడైనను జాతకుడు జారుడగును.

శ్లో. దారేశ్వరేమందమహీసుతగే హేశన్యారయుక్తేక్షణతస్తుజారః
దారాధిపేదారకుటుంబగేవాభౌమేన దృష్టెయది జారదారః.

సప్తమాధిపతి మేషవృశ్చిక మకరకుంభములలో నొకయింట నుండి కుజశనులలో నొకరితో గలసియున్నను లేక వారిలో నొకరిచే చూడబడినను జాతకునిభార్య జారిణియగును. సప్తమాధిపతి ద్వితీయముననుండి కుజశనులలో నొకరిచే చూడబడినను జాతకునిభార్య జారిణియగును.

శ్లో. కుజక్షేత్రగతే శుక్రే శుక్రక్షేత్రగతే కుజః
వేశ్యా వా జారిణీ తస్య భార్యా భవతి నిశ్చితం.

శుక్రుడు కుజషడ్వర్గయందును, కుజుడు శుక్రషడ్వర్గయందును యుండిరేని యాజాతకునిభార్య జారిణియగును. ఇందులకు సందియము లేదు.

శ్లో. మందక్షేత్రే శుక్రభౌమౌ శనిసంయుత వీక్షితౌ
వేశ్యా వా జారిణీ వాపి భార్యా తస్య భవిష్యతి.

కుజశుక్రులు మకరకుంభములందుండి శనితో గలసినను శనిచే చూడబడినను జాతకునిభార్య జారిణియగును. లేకున్న వేశ్యయగును.

శ్లో. సప్తమస్థానగే రాహౌ కరోతి విధవారతిః
కుజే దాసీరతిం కామే శనౌ పూర్వోక్తజం ఫలం.

సప్తమమున రాహువున్న జాతకుఁడు వితంతువులతో సంభోగించువాఁడగును. సప్తమమున కుజశనులలో నెవరున్నను దాసీజనముతో సంభోగించువాఁడగును.

శ్లో. దేహాష్టాధిపౌ యస్య భౌమార్కిస్థానసంస్థితౌ
స్వజాతౌ వన్యదారేషు సురతం కురుతే నరః.

లగ్నాధిపతియు షష్ఠాధిపతియు కలసి కుజక్షేత్రములందుగాని శని క్షేత్రములందుగాని యున్న జాతకుఁడు తనకులములోనున్న యితరస్త్రీలను చెరచువాఁడగును.

శ్లో. శుక్రే చ రాహుణా యుక్తే వస్త్రసంక్షాళికాం యభేత్
బుధేన వైశ్యాం గురుణా విప్రాం భౌమేన బాహుజాం.

శుక్రుఁడు రాహువుతో కలసియున్న జాతకుఁడు చాకలిస్త్రీలతో గలియువాఁడగును. బుధునితోఁగూడిన వైశ్యజాతిస్త్రీలతో సంభోగించువాఁడగును. గురుశుక్రులు కలసియున్న జాతకుఁడు బ్రాహ్మణ స్త్రీలతో రమించువాఁడగును. శుక్రుఁడు కుజుఁడు కలసియున్నయెడల జాతకునకు క్షత్రియాంగనా సాంగత్యము లభించును.

శ్లో. శుక్రక్షేత్రేరవౌ రాహుః సప్తమే విధవాం లభేత్
మదనే భానుసంయుక్తే వంధ్యాం స్థూలాం సచంద్రకే.

శుక్రక్షేత్రములందు అవి సప్తమములై యుండగా వానియందు రవి రాహువుతోఁగూడియున్నయెడల జాతకుఁడు వితంతువులతో సాంగత్యమొనరించువాఁడగును. సప్తమమున సూర్యుఁడొక్కఁడేయున్న జాతకుఁడు గొడ్రాలిని జెందును. రవిచంద్రు లిరువురును కలిసి సప్తమమునందున్న జాతకుఁడు స్థూలశరీరముగల స్త్రీతోసాంగత్యము గల్గియుండును.

శ్లో. దేవేజ్యదైత్యేజ్యఫణీంద్రయోగే ద్విజాంగనామేతి విహీనభర్తృకాం
శుక్రాలయే తు స్మరభే బుధశ్చేద్గర్భాన్వితస్త్రీరతి మేతి జాతః.

ఏజాతకునకు గురుశుక్రరాహువులు కలసియుందురో యాజాతకుఁడు బ్రాహ్మణవితంతువులను చెరచువాడగును. శుక్రక్షేత్రములగు తులావృషభములు సప్తమములై యందు బుధుడున్న జాతకుఁడు గర్భిణులను చెరచువాడగును.

శ్లో. కర్మేశ్వరే రాహుయుతే కుజర్క్షే భానో స్సుతే శుక్రగృహస్థితేవా
శుక్రాసితౌ సంయుతవీక్షితౌ వా పరస్పరం చాధమకామకర్మ.

కర్మస్థానాధిపతి రాహువుతో గలసి కుజక్షేత్రములైన మేషవృశ్చికముల నున్నను శని తులావృషభము లందున్నను శనిశుక్రులిరువురును కలసినను జాతకుఁ డన్యమగు రతి నాశించెడువాఁ డగును.

శ్లో. ఉరుస్తనీ సప్తమగే తమోన్వితే త్వల్పస్తనీ కేతుయుతే బుధేన
అల్పోరుజార్కేణ శుభేన తుంగస్తనీ కుజేనాపి చ దక్షిణాధికా.

సప్తమాధిపతి రాహువుతో కలసియున్న జాతకునిభార్య కుచములు మిగుల పెద్దవై యుండును. సప్తమాధిపతి కేతువుతో గలసియున్న యెడల జాతకునిభార్యకుచములు చిన్నవిగానుండును. సప్తమాధిపతికి బుధసంపర్కమున్న సమమైన కుచములుగల భార్యా జాతకునకు లభించును. సప్తమాధిపతి శుభగ్రహములతో గలసియున్నయెడల జాతకుని భార్యకుచములు పొడుగైనవియు మిగులకఠినములైనవియునై యుండును. సప్తమాధిపతి కుజునితో గలసియున్న జాతకునిభార్యకుచములలో కుడివైపుననున్నది కొలదిగా పెద్దదిగానుండును.

శ్లో. కామేశే జలరాశిస్థే శుక్రే వా చంద్రవీక్షితే
పాపగ్రహై శ్చ సందృష్టే రోమశం స్మరమందిరం.

శ్లో. దారేశే కుజసూర్యార్కిభవనస్థే కలాన్వితే
అల్పరోమా ల్పగుహ్యాత్వం దౌర్గంధ్యం మాన్యగే సమం.

శ్లో. సప్తమే పాపసంయుక్తే ద్వితీయేశ రిపుస్థితే.
అన్యక్షేత్ర చతుర్థేశే పరిక్షీరేణ జీవతి.

సప్తమమున పాపగ్రహమును ద్వితీయాధిపతి (కుటుంబ స్థానాధిపతి) శత్రుక్షేత్రమునందును చతుర్థాధిపతి యితరుల యిండ్లయందును యున్నయెడల నాజాతకుఁడు యితరస్త్రీల స్తన్యముచే పోషింపబడును.

శ్లో. గురుణాపి చ శుక్రేణ సప్తమేశే యుతే క్షితే
గురుశుక్రగృహస్థే వా విశేషసురతమ్ రభేతౌ.

సప్తమాధిపతి గురుశుక్రక్షేత్రముల గురుశుక్రులలో నెవ్వరితోనైన కలసియున్నను విశేష రతిగలవాడగును.

శ్లో. దారేశే కుజసంద్రుష్టే రవిచంద్రయుతే పి వా
రతి ర్మధ్యా శనియుతే రతి రల్పా భవిష్యతి.

సప్తమాధిపతి రవి చంద్రులలో నెవ్వరితోనైనను కలసి కుజునిచే చూడబడుచున్న మధ్యరతి గలవాడగును. సప్తమాధిపతి శనితోగూడియున్నయెడ స్వల్పరతిగల వాఁడగును.

శ్లో. స్మరేశే ఫణిసంద్రుష్టే రతిహీనో ధ్వజేన వా
ద్వితీయేశయుతే క్రూరే జామిత్రే మాంసభోజనః.

సప్తమాధిపతికి రాహుకేతువుల . సంపర్కము గలిగినయెడల జాతకుఁడు స్వల్పముగు రతిగలవాడగును. ద్వితీయాధిపతి క్రూరులగు గ్రహములతో గలసి 7 టనున్న జాతకుఁడు మాంసమును భుజించువాడగును.

శ్లో. దారేశ్వరే తు యత్క్షేత్రే తత్క్షేత్రాధిపసంయుతే
శుభగ్రహేణ సంద్రుష్టే గుడక్షీరాదిభోజనః.

సప్తమాధిపతి యెవ్వనియింటనుండెనో వానితోగలసియుండి శుభులచే చూడబడుచున్న యెడల జాతకుఁడు చక్కెరక్షీరములు మున్నగు తీయని ఆహారములు భుజించునట్టి వాడగును.

శ్లో. సప్తమాధిపతౌ కేంద్ర గురుశుక్రయుతే క్షితే
దీర్ఘాయు ర్నృపతుల్య స్సాన్య ద్ధర్మజ్ఞానపరో నరః.

సప్తమాధిపతి కేంద్రములనుండి గురుశుక్రులచే చూడబడిన యెడలను, లేక గురుశుక్రులతో జేరియున్నను చాలకాలము జీవించువాడగును.

ఆయుర్భావము.

శ్లో. ద్వాత్రింశత్పూర్వ మల్పాయు ర్మధ్యమాయు స్తతఃపరం
సప్తత్యాః పరతః పూర్ణం వదే దిత్యాహ కేరళః.

జన్మించిన సంవత్సరము మొదలు 32 సంవత్సరములు జీవించిన మనుష్యుఁడు అల్పాయుర్దాయము గలవాడును, 33 కెక్కుడుగను 70 సంవత్సరములకు తక్కువగను జీవించిన మధ్యమాయుర్దాయ మనియును, అంతకెక్కుడుగా జీవించిన పూర్ణాయుర్దాయమనియు పెద్దల యభిప్రాయము. మనుష్యుని పరమాయుర్దాయము 120 సంవత్సరములు.

శ్లో. లగ్నేశస్య రవి ర్విసర్గరిపుతా మే త్యల్ప మాయు స్సమే
శత్రుత్వే పి సుహృత్త్వకే నిగదితం చాయు స్తథా మధ్యమం
తత్కాలేపి నిసర్గతశ్చ సుహృది స్యా త్పూర్ణ మాయూరవౌ
లగ్నేశార్కసుహృత్వవీర్యవశతో జాతస్య చాయు ర్వదేత్

లగ్నాధిపతి, సూర్యుడు వీరిరువురకును నైసర్గికశత్రుత్వమున్న యెడల జాతకు డల్పజీవియగును. లగ్నాధిపతికిని సూర్యునకును నైసర్గిక శత్రుత్వముగాని తాత్కాలికశత్రుత్వముగానియుండి నైసర్గిక సమత్వముగాని తాత్కాలిక శత్రుత్వముగాని యున్న జాతకుఁడు మధ్యమాయుర్దాయము గలవాఁడగును. లగ్నాధిపతికి సూర్యుడు నైసర్గికమిత్రుడైన మధ్యాయురోగ్యము గలుగును లగ్నాధిపతికి సూర్యుఁడధిమిత్రుడై యున్నయెడల సంపూర్ణాయురోగ్యంబు. కావున లగ్నాధిపతి సూర్యుల బలతారతమ్యమునుబట్టి ఆయుర్దాయమును నిర్ణయింపవలయును.

శ్లో. క్రూరాష్షష్ఠగతా స్తృతీయభవనే లాభే చ యే సంస్థితా
దీర్ఘాయు ర్మనయో వదంతి సతతం జాతస్య సౌఖ్యాదికం

లగ్నేశే బలశాలిని స్వగృహగే కేంద్రేథవా సంస్థితే
పూర్ణాయుస్సుగుణాధికత్వమపిచఖ్యాతింవదేత్సూజ్యతాం.

క్రూరులగు గ్రహములు 3, 6, 11 స్థానములయం దుండిరేని జాతకునకు సంపూర్ణమగు ఆయుర్దాయముకలుగును. లగ్నాధిపతి బలయుతుండై తనక్షేత్రములందుగాని కేంద్రములందుగాని పాపగ్రహసంపర్కాదికములు లేకున్నయెడల జాతకునకు సంపూర్ణమగు ఆయుర్దాయము కలుగును.

శ్లో. ఆయుస్థానగతే థవా రవిసుతే రంధ్రాధిపే స్వోచ్ఛగే
స్వక్షేత్రే బలసంయుతే నిగదితం దీర్ఘాయు రే వాధికం
రాహు శ్చ త్రిషడాయగ శ్శుభయుతః ఖేటై శ్శుభై ర్వీక్షితః
పూర్ణాయు స్సుతదారసౌఖ్యసహితం జాతస్యదద్యాద్ధ్రువం.

అష్టమమున శనియున్న దీర్ఘాయువు గలుగును. శని అష్టమమున నుండగా నాస్థానాధిపతి యుచ్ఛయందున్నను, స్వక్షేత్రములం దున్నను దీర్ఘాయురారోగ్యము. రాహువు 3, 6, 4 స్థానముల శుభులతో గలసిగాని శుభులచే చూడబడినను జాతకునకు పూర్ణాయుర్దాయము.

శ్లో. కేంద్రస్థే సహజాధిపే ష్టమపతౌ మధ్యాయుషొ నిశ్చయ
స్తుంగస్తే సహజేశ్వరే నిగదిత ష్షష్ట్యబ్దజీవీ నరః
షష్టద్వాదశసంస్థితే నిధనపే తద్భావనాథాష్టమే
పూర్ణాయు ర్గురుశుక్రసోమతనయైః కేంద్రత్రికోణస్థితైః.

తృతీయాష్టమాధిపతులు కేంద్రములనున్నయెడల జాతకునకు మధ్యమాయుర్దాయము, తృతీయాధిపతి యుచ్ఛయందున్న జాతకుడు 60 వత్సరములు జీవించును. అష్టమాధిపతి 6, 12 స్థానముల నుండునపు డాతడున్న స్థానాధిపతిరాశికి అష్టమమున నున్నను బుధగురుశుక్రులు మువ్వురును కేంద్రకోణములందున్నయెడల సంపూర్ణాయుర్దాయమని తెలియవలెను.

శ్లో. లగ్నేశే యది కేంద్రగే గురుయతే శుక్రేణ వా వీక్షితే
దీర్ఘాయుః ప్రవదంతి సర్వమునయో జాతస్య సౌఖ్యంధనం
రంధ్రేశేన శుభగ్రహే శుభగృహే కేంద్రత్రికోణాలయే
పూర్ణాయుస్త్వదితం పురాణమునిభిర్జాతస్య విద్యాసుఖం.

లగ్నాధిపతి కేంద్రములలో నొకదానియందుండి గురుశుక్రులలో నొకనిచే చూడబడినయెడలను లగ్నాధిపతి గురుశుక్రులలో నొకరితో కలసి కేంద్రములనుండినను జాతకునకు దీర్ఘాయువు. అష్టమాధిపతిశుభ గ్రహములతో గలసి శుభస్థానములలోగాని కేంద్రకోణములందుగాని యున్నయెడల జాతకుడు దీర్ఘాయువు గల్గువాడగును. మరియు నట్టి జాతకుడు విద్యయు సౌఖ్యమును గలుగువాడగును.

శ్లో. స్వోచ్చే వా స్వగృహే స్వమిత్రభవనే భానోస్సుతే సంయుతే
వీర్యేణాయు రుదాహరంతి మునయః పూర్ణం సదాత్మత్వకం
జీవో వా భృగునందనో బలయుతశ్చేత్కేంద్రగశ్చాయుషః
పూర్ణత్వం శుభకర్మ ధర్మకలితం జాతస్య శాస్త్రోదితం.

శని యుచ్చయందుగాని స్వక్షేత్రములందుకాని మిత్రక్షేత్రము లందుగాని బలుడై యున్నయెడల జాతకునకు పూర్ణాయువు గలుగును. గురుశుక్రులు శుభులై కేంద్రములందున్నను పూర్ణాయువుగలవాడగును. మరియు జాతకుడు శుభకర్మములను ధర్మకార్యములను చేయువాడగును.

శ్లో. లగ్నేశాష్టమనాథకర్మపతయ స్సౌరిశ్చ వీర్యాన్వితాః
కేంద్రే లాభగృహే త్రికోణభవనే పూర్ణాయుషః ప్రాపకాః
శుక్రేజ్యేందుసుతా స్తృతీయభవనే లాభే చ విత్తాలయే
వీర్యాఢ్యా యది మధ్యమాయు రుదితం జాతస్య గర్గాదిభిః.

లగ్నాధిపతి, అష్టమాధిపతి, దశమాధిపతి శని యీనలువురును కేంద్రములందుగాని కోణములందుగాని లాభమునందుగాని యున్నయెడల

జాతకునకు పూర్ణాయువుగల్గును. గురుబుధశుక్రులు ద్వితీయ తృతీయ లాభములందు యుండిరేని మధ్యమాయుర్దాయముగల జాతకుండగును. ఇది గర్గాదిమునుల యభిప్రాయము.

శ్లో. శుక్రో వా సురపూజ్యో వా కేంద్రే త్వేకః స్థితో యది
పంచాశద్వర్ష మాయుష్య ముభౌ చే చ్ఛతవత్సరం.

శుక్రుడుగాని గురుఁడుగాని కేంద్రముల నున్నయెడల జాతకుఁడు 50 వత్సరములు జీవించువా డగును. ఇరువురును కేంద్రకోణములందున్న యెడల జాతకుఁడు నూరేండ్లు జీవించువాఁ డగును.

శ్లో. లగ్నాధీశ్వరరంధ్రపౌ యది గతౌ నైచ్యం తథా దుర్బలౌ
స్వల్పాయు స్సమఖేటరాశికలితౌ వాయు శ్చతుష్షష్టకం
ధర్మాధీశ్వరకర్మపౌ తనుగతౌ పూర్ణాయు రిత్యుచ్యతే
యుక్తౌ భాగ్యసుతేశ్వరౌ గురుయుతౌ దృష్టౌ శతాయు ర్భవేత్.

లగ్నాష్టమాధిపతులు బలహీనులై యున్నను, నీచంగతులైనను జాతకున కల్పాయువగును. లగ్నాష్టమాధిపతులు సమగ్రహములైన వారింటియందున్నగాని సమానబలవంతులై యున్నగాని జాతకుఁడు 64 సం॥ జీవించును. రాజ్యభాగ్యాధిపతు లిరువురును బలాధికులైన జాతకునకు పూర్ణాయువు గలుగును. లగ్నాధిపతియు పంచమాధిపతియు గురునిచే జూడబడినను గురునితో గలసినను జాతకునకు పూర్ణాయువు కలుగును.

శ్లో. చంద్రే తుంగసుహృత్త్రికోణభవనే శుక్రేజ్యయుక్తే క్షితే
పూర్ణాయు ర్గురుశుక్రలగ్నపతిభి స్స్వోచ్చే తు సౌమ్యేక్షితైః
లగ్నేశో దశమే చ లగ్నసుతకామస్థా శ్చ రాజ్యస్థితాః
పుత్రాధీశ్వరవీక్షితా యది భవే త్పూర్ణాయుష స్సంభవః.

చంద్రుడు యుచ్చయందుగాని మిత్రక్షేత్రములందుగాని మూల త్రికోణమునందుగాని యుండి గురుశుక్రులచే చూడబడిన నాజాతకుడు

పూర్ణాయువు గలవాడగును. గురుశుక్రలగ్నాధిపతులందురును యుచ్ఛయందుండి శుభులచే చూడబడినను జాతకుఁడు పూర్ణాయువు గలవాడగును. లగ్నాధిపతి లగ్నముననుదశమాధిపతి దశమముననుయున్నను లేక దశమాధిపతి లగ్నమందును లగ్నాధిపతి దశమమందును పరివర్తనగా యున్నను లగ్నాధిపతి, దశమాధిపతి యిరువురు కలసి పుత్రస్థానాధిపతిచే చూడబడినను జాతకుఁడు పూర్ణాయువు గలవాఁడగును.

శ్లో. లగ్నేశే శశిసంయుతే శుభఖగైర్దృష్టే చ రంధ్రాధిపే
వీర్యాఢ్యే గురుసంయుతే నవమనాథే నాన్వితే వీక్షితే
లగ్నస్థే సురపూజితే దశమనాథే నాన్వితే వీక్షితే
పూర్ణాయుః పురుషస్య శాస్త్రగదితం వీర్యానురూపం భవేత్

లగ్నాధిపతి చంద్రునితోఁగలసి శుభులచే చూడబడినను అష్టమాధిపతి బలయుతుఁడై గురునితోఁగలసి భాగ్యాధిపతిచే చూడబడినను, గురుడు లగ్నముననుండి దశమాధిపతిచే చూడబడినను, గురుఁడు దశమాధిపతి యిరువురును కలసి లగ్నమందున్నను వారివారిబలాధికములను బట్టి ఆయుర్దాయము నిర్ణయింపవలయును.

శ్లో. భాగ్యేశే తనునాయకే క్షితియుతే జీవే క్షిణే పుత్రపే
కర్మేశే యది తుంగకేంద్రభవనే మానే శుభేనాన్వితే
మానేశే సుతనాథవీక్షితయుతే లాభే శనౌమిత్రగే
రంధ్రేశేపి చ కేంద్రగే జనిమితాం మధ్యాయు రుక్తం బుధైః.

లగ్నభాగ్యాధిపతు లిరువురును కలిసినను, పంచమాధిపతిని గురుఁడు చూచినను, దశమాధిపతి యుచ్ఛయందు కేంద్రముననున్నను రాజ్యస్థానమున శుభగ్రహములున్నను 5, 10 స్థానాధిపతులు కలసినను లేక యొకరినొకరు చూచినను శని లాభమునగాని మిత్రక్షేత్రమునగాని యున్నను, అష్టమాధిపతి కేంద్రములందున్నను జాతకుడు మధ్యమాయుర్దాయము గలవాడగును.

శ్లో. మందే భాగ్యగతే చ మిత్రభవనే జీవేక్షితే మధ్యమం
లగ్నస్థే సహజాధిపే ష్టమపతౌ భాగ్యేశదృష్టేపి వా
ధర్మే లగ్నపతౌ తనౌ సుతపతౌ చాయుస్తదా మధ్యమం
రాజ్యేశే సుతగే నిశాకరబలే భాగ్యే సుతేశే భవేత్.

శని భాగ్యమందుగాని మిత్రక్షేత్రమునగాని యుండి గురుదృష్టి గల్గియున్నను, తృతీయాష్టమాధిపతులు లగ్నమునుబొంది భాగ్యాధిపతిచే చూడబడినను, లగ్నపంచమాధిపతులు పరివర్తనగా నొకరింట నొకరున్నను చంద్రుడు బలయుతుండై యుండ రాజ్యపంచమాధిపతులు పంచమభాగ్యములనున్నను జాతకునకు మధ్యమాయువు గలుగును.

శ్లో. ధర్మేశే తనుపాన్వితే చ గురుదృష్టే స్యు శ్శతం వత్సరా
స్త్వాయుక్తాయది లగ్నగౌ సుతపదృష్టౌ పూర్ణయాయు ర్భవేత్
ధర్మేశే గురుసంయుతే సతపతౌ క్రూరై రయుక్తేక్షితే
పూర్ణాయుః పురుషస్య భార్గవమితే సద్భిష్ట ముక్తం బుధైః,

లగ్న నవమాధిపతులు గలసి గురునిచే చూడబడినయెడల జాతకుడు 100 వత్సరములు జీవించువాడగును. లగ్నభాగ్యాధిపతులు లగ్నముననుండి పంచమాధిపతిచే చూడబడినను, నవమాధిపతి గురుదృష్టి గల్గియుండ పంచమాధిపతికి పాపులతో సంపర్కము లేకున్నను జాతకుడు పూర్ణాయువు గలవాడగును.

శ్లో. లగ్నేశే వ్యయరంధ్రనాథసహితే రంధ్రే తృతీయాధిపే
పాపై రన్వితవీక్షితే ల్ప ముదితం రంధ్రేశదేహేశ్వరౌ
సంయుక్తౌ గురుణా త్వవీక్షితయుతౌ రిప్ఫారిగే లగ్నపే
చంద్రే ద్వాదశషష్ఠమృత్యుకలితే చాల్పాయు రుక్తం బుధైః.

లగ్నాధిపతి 8, 12 స్థానాధిపతులతో గలసినను, తృతీయాధి పతి అష్టమమందుండి పాపులచే చూడబడుచున్నను, లగ్నాష్టమాధి పతులు

కలసి గురునిచే చూడబడినను లగ్నాధిపతి 6, 12 స్థానముల నున్నను జాతకుఁడు అల్పకాలము జీవించువాడగును.

శ్లో. పుత్రేశే హిబుకాధిపే దశమగే క్రూరగ్రహై ర్వీక్షితే
బాల్యాయు ర్బలహీనలగ్నపయుతే కేంద్రత్రికోణే గురౌ
మధ్యాయు శ్చతురష్టపే శుభఖగే జీవే క్షితే వా భవే
త్పూర్ణాయు ర్బహుశాస్త్రసమ్మత మిదం గోపాలర _ _ కరే.

చతుర్థపంచమాధిపతులు క్రూరులతో గలసి రాజ్యమందున్నను లగ్నాధిపతి బలహీనుఁడై గురునితోఁగలసి కేంద్రకోణములనున్నను మధ్యమాయుర్దాయము చెప్పవలెను. 4, 8 చూడబడినయెడల జాతకుఁడు పూర్ణాయువు గలవాడగును.

శ్లో. క్రూరే రిఫ్పాష్టమస్థె ప్యథ శనినిధనేశౌ సపాపౌ చ దృష్టౌ
చే ద్వారిణ్యాశుభే బలేన రహితే లగ్నాధిపో వాల్పకం
సీర్వీర్యా తనుమధ్యపా బలఖగా లగ్నేపి వా సప్తమే
చాల్పాయు ర్గదితం పురాణమునిభి ర్జాతికే.

పాపగ్రహములు 12, 8 స్థానములనున్నను అష్టమాధిపతి శనితోఁగలసి పాపులచే దిలకింపబడినను, లగ్నాధిపతి బలవర్జితుఁడై యుండ చతుర్థమునకును లగ్నాధిపతికిని శుభగ్రహసంపర్కము లేనియెడలను లగ్నాష్టమాధిపతులు బలహీనులై యున్నను, పాపులు లగ్నసప్తమముల నున్నను జాతకుడు కొలదికాలమే జీవించునట్టివాడగును.

శ్లో. జీవే కేంద్రగతే పి చోచ్ఛకలితే షష్టేష్టమే ద్వాదశే
సర్వానిష్టనివారణం నిగదితం కేంద్రే చ లగ్నేశ్వరే
చే ద్వీర్యేణ సమన్వితే త్వథ గురౌ శుక్రే బుధే వా తథా
కేంద్రే వా ప్యథ కోణగే నిగదితం చాయుశ్చిరం పండితైః.

గురుడు యుచ్ఛయగు కేంద్రమునందున్నను 6, 8, 12 స్థానములందున్నను సర్వారిష్టములును పరిహరింపబడును. లగ్నాధిపతి బలయు

తుఁడై కేంద్రములందుండిన బాలారిష్టము కలుగదు, గురు, బుధ, శుక్రులు కేంద్రకోణముల నున్నయెడల జాతకుడు అనేకములగు నరిష్టము లను బాసి చిరకాలము జీవించువాడగును.

శ్లో. లగ్నే దేవగురౌ బలీయసి యదా స్యాత్తస్య సర్వాపదో
నశ్యంత్యేవ హి దుష్టఖేటకలితారిష్టం తథా శామ్యతి
రాహూ ర్వా క్రియగో కులీరహరికీటగ్రాహరాశిస్థిత
స్సర్వారిష్టనివారణం ప్రకురుతే జాత శ్చిరాయు ర్భవేత్

గురుడు లగ్నమున బలీయుడై యున్నను రాహువు మేషవృషభ కర్కాటక సింహమకరములలో నెచ్చటనైన నున్నను నితరగ్రహములు గలుగజేసే సర్వారిష్టములును పరిహారములగును. జాతకునకు ఆయుర్వృద్ధి నిశ్చయముగా గలుగును.

శ్లో. చంద్రాద్య నిష్టశాంతి స్స్యా త్కేంద్రే చే ద్గురుభార్గవౌ
అనష్టగ్రహాగ శ్చంద్రో గురుదృష్టో న దోషకృత్.

కేంద్రముల గురుశుక్రు లున్నయెడల చంద్రుడు మొదలుగాగల గ్రహము లిచ్చునట్టి సర్వారిష్టములును పరిహారములగును. చంద్రుడు పాపస్థానములనున్నను గురునిచే చూడబడినను దోషియగును.

శ్లో. దుష్టస్థానగతే చంద్రే శుక్లపక్షే తు రాత్రిషు
కృష్ణపక్షే దివా జన్మ స్థానదోషో నవిద్యతే.

చంద్రుడు పాపస్థానములనున్నను, శుక్లపక్షరాత్రులందు జనించిన వారికిని కృష్ణపక్షమున పగటిపూట జనించినవారికిని దోషికాజాలదు.

శ్లో. లగ్నాధిపో ష్టమేశో వా శని శ్చే చ్ఛుభసంయుతః
పూర్ణాయుః కథితం నృణాం జ్యోతిశ్శాస్త్రవిశారదైః.

శని లగ్నాష్టమాధిపత్యములలో నొకటిగలిగి శుభకరమగు స్థానములందు శుభుడై యున్నయెడల జాతకునకు పూర్ణాయువు గలుగును,

శ్లో. ఆయుస్థానగతే భౌమే లగ్నస్థే యది భాస్కరే
నృపతుల్యసుఖీ జాతో దీర్ఘాయుష్మాన్ భవిష్యతి.

లగ్నమున రవియు, అష్టమమున కుజుడును యున్నయెడల జాతకుడు మంచి ఆయుర్భాగ్యమును పొందుటయేగాక రాజయోగమును కూడ పొందువాడగును.

శ్లో. జాయానేత్రపతీ స్వపాకమృతిదౌ తత్రస్థితాః పాపినో
రిష్ఫేశోపి చ రిష్ఫగః ఖలఖగో నోచే చ్ఛుభత్వాన్వితః
రంధ్రేశ స్సహజేశ్వర శ్శుభయుతో నోచే చ్చ షష్ఠేశ్వరం
స్వక్షేత్రోచ్చభకోణపో నమృతకృ చ్చంద్రార్కఖేటావినా.

సప్తమ ద్వితీయాధిపతులు మారకులు. మరియు సప్తమద్వితీయములందుండువారును మారకులు. సప్తమముకన్నను ద్వితీయము ఎక్కుడగు మారకస్థానము. అటుపిమ్మట వ్యయాధిపతి మారకుడు. అటుపిమ్మట ద్వాదశమందుండువారు మారకులు. అట్టివారలకు శుభగ్రహములతోగలసి శుభులచే చూడబడుచున్నను మారకులుగారు. 3, 6, 8 స్థానాధిపతులు శుభసంపర్కముగల్గి యుచ్ఛయందుగాని; మూల త్రికోణములందుగాని బలీయులై యున్న మారకము నీయజాలరు. 3, 6, 8 స్థానాధిపతులకు పాపగ్రహసంపర్కము గల్గినయెడల వారు మారకులగుదురు. సూర్యచంద్రులు స్వతంత్రముగా మారకము నీయజాలరు.

ఈ విషయములను గమనించి తగు జాగరూకతతో మారకగ్రహములను నిర్ణయింపవలసియుండును.

శ్లో. ఉత్తమారకతాభావే కుర్యా త్పాపాధికో మృతిం
అతిక్ర మ్యేతరా న్పాపీ నిహంతా మారక శ్శనిః.

పైనజెప్పబడినట్లుగా మారకనిర్ణయము గావించుట కవకాశము లేనియెడల పాపస్థానాధిపత్యము, పాపుల సంపర్కము గల్గియున్నవారిలో నెక్కుడుపాపి యెవ్వడో వాడు మారకుడగును. అట్టివానిదశ

యందుగాని, వాని యంతర్దశయందుగాని మారకము జరుగును. ఇతర మారకగ్రహములు మారకత్వముగల్గియున్నను శనికి పాపత్వమును మారకత్వమును గల్గియున్నయెడల యితరగ్రహములనణచి తానే స్వతంత్రముగా మారకము నీయగలడు.

శ్లో. ఆయుషః పూర్ణమధ్యాల్పయోగగ్రహబలాధికే
మారకగ్రహదార్బల్యే మారకత్వ తు నిష్ఫలం.

ఆయుర్భాగ్యము నిచ్చు గ్రహము లధికబలము కలవియై యుండగా మారకగ్రహములు బలహీనములైనయెడల మారకము నీయజాలవు.

శ్లో. మారకస్య దశాకాలే సంబంధ శ్శుభభుక్తిషు
అసంబంధఖలానాం చ మారకో భవతి ధృవం.

నిర్ణయింపబడిన మారకుఁడు స్వభుక్తిలో మారకనిూయక తన్నుజేరిన శుభులయొక్క అంతర్దశల యందుగాని తనతో సంపర్కముగల్గిన పాపుల అంతర్దశయందుగాని మారకము నిచ్చువాడగును.

శ్లో. అష్టమద్వాదశాధీశౌ బలినౌ మృత్యుదాయకౌ
స్వదశాభుక్తికాలే తు దుర్బలౌ దుఃఖదాయకౌ.

12, 8 స్థానాధిపతులు బలవంతులై యుండిన వారు తమదశల యందు తమ స్వదశలయందే మారకముగల్గింతురు. వారు బలహీనులైనయెడల మారకముచేయరు. అట్టివారు శరీరపీడయు చోరభయము మున్నగువానిని మాత్రము గల్గింతురు.

శ్లో. అష్టమస్థాష్టమాధీశ దశావాజన్మకాలికే
లగ్ననాథదశా వాపి చింత్యా మరణభీతిదా.

జాతకుని జననకాలమునకు అష్టమాధిపతిదశగాని, లగ్నాధిపతి దశగాని యైనయెడల నామహాదశ గడచువరకు అరిష్టము గలుగగలదని తలంపవలయును.

శ్లో. కుళీరలగ్నే ససితే గురౌ మీనగతేపి చ
చంద్రే వ్యయగతే కీటే మందాదయోవినాశనః.

కర్కాటక లగ్నమున శుక్రుడును, మీనమున గురుడును, మిథునమున చంద్రుడును యుండగా వృశ్చికమందు శనియున్న శనిమహాదశయందు మారకము జరుగును. గురు శుక్రాదులు బలవంతులైనను మారకదశయగు శనిమహాదశయందు మారకము జరుగకమానదు.

శ్లో. పరాశరమతం త్వేతత్ జైమినే స్తు మతేః పరం
అష్టమేశో భవే ద్రుద్ర స్తత్రస్థో వా బలీ బలః.

ఇపుడు చెప్పినదంతయును పరాశరమహాముని యభిప్రాయము ననుసరించినదై యున్నది. ఈవిషయమున జైమినియుద్దేశ్యమేమనగా అష్టమాధిపతిగాని, అష్టమమునందున్న గ్రహముగాని (పాపగ్రహము) మారకు డగుచుండును.

శ్లో. పూర్వ మాయుః పరీక్షేత పశ్చా ల్లక్షణ మీక్షయేత్
సతి కుడ్యే చిత్రకర్మ తస్మా దేత ద్విచింత్యతాం.

శుభయోగములను ముందుగా యోచించుట తగదు. ఆయుర్భాగ్యమునే ముందుగా తిలకింపవలయును. గోడయొక్కటి యున్నయెడలగదా దానిపై చిత్రములువ్రాయుట. కావున మున్ముందు ఆయుర్భావమును చక్కగా యోచింపవలయును.

## నవమభావము.

శ్లో. కోణేశా స్సకలాః ఖగా శ్శుభకరా స్తే షష్ఠలాభత్రిపా
శ్చే త్పాపాఅపి కేంద్రపా నశుభదా సౌమ్యా అధోధో త్తరం
క్రూరస్య త్వథ కేంద్రపత్యె మురుసౌఖ్యార్థం సపాపో బుధః
క్షీణేందు శ్చ ఖలత్వ మేతి మృతిపః పాపో నలగ్నే ద్యది.

కోణాధిపతులగు గ్రహములు శుభదాయకములు. గ్రహములకు 3, 6, 11 స్థానముల కాధిపత్యముః గల్గిన వారు శుభులుకారు. కోణాధిపతులకు 3, 6, 11 స్థానాధిపత్యములు గల్గినయెడల వారుగూడ పాపులై యగుదురు. కాని శుభదాయకులు కాజాలరు. శుభులగువారలకు కేంద్రాధిపత్యములు గల్గినవారు పాపులగుదురు. చంద్రునికంటె బుధుడు బుధునికంటె గురుఁడు గురునికంటె శుక్రుఁడును కేంద్రాధిపత్యదోష మెక్కుడుగా గలవారు. పాపులతో జేరిన బుధునకును, రవికుజశనులకును కేంద్రాధిపత్యము గలుగుటమంచిది. అష్టమమున భాగ్యమునకు 12 వ స్థానమగుటచే పాపస్థాన మలవడుచున్నది. ఆకారణముననే అష్టమాధిపతి పాపు డనబడుచున్నాడు. అష్టమాధిపతికి లగ్నాధిపత్యము గూడ గల్గినయెడల నాతఁడు శుభుఁడగును.

శ్లో. ధర్మేశే స్వగృహోచ్చకర్మసహితే సంపూర్ణభాగ్యం భవేత్
లగ్నే చా ప్యథ బంధుమిత్రసుతభే తైశ్వర్య మర్ధం స్మృతం
లాభే సప్తమభే ర్ధభే చ సహజే భాగ్యం తుపాదాంశకం
త్వన్యత్రాష్టమ భాగ్యతుల్య ముదితం జాతస్య యద్యుజ్యతే.

భాగ్యాధిపతి స్వక్షేత్రమునగాని యుచ్ఛయందుగాని దశమమునగాని యున్నజాతకుఁడు మిక్కిలి భాగ్యవంతుఁడగును. నవమాధిపతి లగ్నమునగాని చతుర్థపంచమములందుగాని యున్నను, భాగ్యాధిపతి మిత్రక్షేత్రములందున్నను జాతకుఁడు భాగ్యవంతుఁడగును. నవమాధిపతి ద్వితీయమందుగాని తృతీయమందుగాని సప్తమమందుగాని లాభమందుగాని యున్నయెడల పాతికభాగ్యము గలవాఁడగును. భాగ్యాధిపతి 6, 8, 12 స్థానములనున్నను, శత్రుక్షేత్రమునందున్నను,నీచంగతుఁడైనను జాతకుని భాగ్యము స్వల్పముగానుండును.

శ్లో. ఏవంకర్మపతౌ చ ధర్మసహితే చే త్స్వోచ్చమిత్రాలయే
భాగ్యం పూర్ణ ముశంతి మిత్రభవనే లగ్నే గృహే పుత్రభే

అర్థం చాథ ధనత్రిసప్తభవనే లాభేపి పాదం తతో
స్యత్ర త్వష్టమభాగమే నహి పరం పుణ్యానురూపం ఫలం.

రాజ్యాధిపతి భాగ్యమందుండినను, ఉచ్ఛయందున్నను, మిత్ర క్షేత్రమునందున్నను, భాగ్యవంతుఁడగును. మిత్రక్షేత్రమగు కేంద్రమందగాని, వాహనమునగాని పంచమమునగాని రాజ్యాధిపతియున్న నధి భాగ్యముండును. 6, 8, 12 స్థానముల రాజ్యాధిపతియున్నను శత్రుక్షేత్రములందుగాని నీచయందుగాని యున్నను జాతకుఁడు స్వల్పభాగ్యమ గలవాడగును. దశమాధిపతి 2, 3, 11, 7 స్థానములనున్న పాతికపాల భాగ్యముగలవాడగును.

శ్లో. నేత్రద్వాదశనాయకౌ స్థితయుతస్థానగ్రహాణాం ఫలం
దద్యాస్తా మధ రాహుకేతుయుగళం తద్వ త్ఫలం దాస్యతి
భౌమస్య త్వధ శర్మపత్వకలితం కోణాధిపత్వే శుభం
నోచే న్నైవ శుభాశుభత్వకలనం వీర్యాదినిర్దేశతః.

ద్వితీయ ద్వాదశాధిపతులు యేభావమందుందురో ఆభా ఫలమును, తా మేగ్రహములతో గలియుదురో ఆగ్రహములిచ్చు భావఫలమును యిచ్చుచుందురు. రాహుకేతువులుగూడ వ్యయ ద్వితీయాధిపతుల వలెనే ఫలమొసంగు చుందురు. నైసర్గికపాపియగు కుజుఁడు కేంద్రాధిపత్యముచే శుభుఁడైనను, దశమకేంద్రమున కధిపతియై యుండగూడదు. అట్టికుజునకు పంచమకోణాధిపత్యముకూడ గల్గిన (కర్కాటలగ్నజాతకులకు) పాపిగాక శుభఫల మొసంగువాఁడే యగును. కుంభలగ్నజాతకునకు కుజుఁడు తృతీయ రాజ్యాధిపతి యగుటచే పాపియు చెప్పబడెను.

శ్లో. ధర్మాధీశ్వరకర్మపౌ త్రిరిపురంధ్రాయవ్యయేశత్వతః
పాపిత్వేపి పరస్పరం యది భవేతాం కర్మధర్మస్థితౌ

దద్యాస్తాం శుభ మేవ రాజ్యసుఖదా నోచేన్న యోగప్రదా
నిర్దుష్టా సుఖ మేవ చేత్త్రదుభయాధీశోపి యుక్సంచమే.

భాగ్యరాజ్యాధిపతులు కలసిన శుభులై రాజయోగ మిచ్చువా రగుదురని చెప్పుట సామాన్య నిర్ణయము. భాగ్యరాజ్యాధిపతులం పరివర్తనగానున్నయెడల—అట్టిభాగ్య రాజ్యాధిపతులకు యితరపాపాధిపత్యములున్నను వారు శుభకరులై రాజయోగకారకు లగుదురు. భాగ్యరాజ్యాధిపతులకు పరివర్తనలేనపుడు తృతీయ షష్టాష్టమవ్యయస్థానాధిపత్యములు గలుగుటచే పాపత్వముగూడ గలుగును. ధర్మకర్మాధిపత్యములు రెండును యొకనికే గల్గినపుడు ఆగ్రహమొక్కటే రాజయోగము నిచ్చునది యగును.

శ్లో. కేంద్రత్రికోణనేతారౌ సహితౌ యోగకారిణౌ
యది పాపగ్రహై ర్యుక్తౌ దద్యాస్తాం మధ్యమం ఫలం.

కేంద్రకోణాధిపతులు కలసియున్నయెడల సామాన్యమైన రాజయోగము నిచ్చువారగుదురు. శుభులగు కేంద్రకోణాధిపతులతో పాపగ్రహములుకూడ చేరినయెడల సామాన్యఫలము గల్గును.

శ్లో. తృతీయ షష్ఠాష్టమలాభరిప్ఫనాథస్య చేద్యోగకరానుబంధః
తద్దాయకాలేపిచయోగభుక్తౌశుభాన్వయే తస్య చ సౌఖ్యమాహుః.

3, 6, 8, 12 స్థానాధిపతులు పాపులు. వీరిలో నెవ్వరికైనను యోగకారకశుభగ్రహముతో కలసియుండుట ప్రాప్తించిన యాగ్రహము యొక్క దశయందు యోగకారకుని అంతర్దశయందు శుభము గల్గును. యోగకారకునితో శుభగ్రహములు కలసినయెడల యోగకారకుని దశయందు నాయాశుభగ్రహముల అంతర్దశలయందు శుభయోగముగల్గును.

శ్లో. సవీర్యకేంద్రకోణేశయోగే తచ్ఛుభతోచితా
సుఖభాగ్యేశ్వరౌ రాజ్యపంచమేశయుతౌ శుభౌ!

బలవంతులగు కేంద్రకోణాధిపతులు కలసియున్న యెడల రాజయోగము గలుగును. సుఖాధిపతి భాగ్యాధిపతితోడను, రాజ్యాధిపతి పంచమాధిపతితోను గలసినను రాజయోగము గలుగును.

శ్లో. ధర్మకర్మేశయోగోత్థ రాజయోగఫలం శుభం
తద్దాశాయాం తు తదయుక్ఛుభభుక్తౌ ధృవం భవేత్.

భాగ్యరాజ్యాధిపతులవలన గలుగవలసిన శుభయోగము వారి దశలయందుగాని, వారితోగలసిన లేక సంపర్కముగల యితరశుభగ్రహముల అంతర్దశలయందుగాని యోగము ప్రారంభమగును. అట్టిగ్రహములలో బలాధిక్యత గల్గిన దశలయందు రాజయోగము ప్రారంభించును.

శ్లో. కేంద్రత్రికోణపతినా త్రికోణే కేంద్రవేన చ
రాహుకేతూ భవేతాం తౌ సంయుక్తౌ యోగకారిణౌ.

కేంద్రమందు రాహువు కోణాధిపతితో గలసియున్నను, కోణమున రాహువు కేంద్రాధిపతితో గూడియున్నను యోగకారకుడగును. కేతువుగూడ రాహువువలెనే యోచించువాడగును.

శ్లో. ధర్మకర్మయోగస్య రంధ్రలాభేశయోగతః
యథాకథంచి త్సత్వేపి భంగో భూయా న్న సంశయః.

భాగ్యరాజ్యాధిపతులకు అష్టమలాభాధిపతులతో సంపర్కమెంతమాత్రమును తగదు.

శ్లో. రాజయోగకరఖేటదశాయాం మారకాంతరభవః ఖలు యోగః
తత్సుతస్య ఖచరస్య ఖలస్య స్యాద్బలీ ఫలమయుక్ఛుభభుక్తౌ.

రాజయోగకారకుని మహాదశయందు మారకగ్రహముయొక్క అంతర్దశవచ్చిన యోగారంభమగును. పాపులభుక్తియందు యోగము ప్రబలముగా నుండును. యోగకారకగ్రహముతో సంపర్కములేని యితర శుభగ్రహములయొక్క యోగఫలముండదు.

శ్లో. శుభస్థానగతౌ కైశ్చి దయుక్తౌ యోగకారకౌ
రాహుకేతూ స్వస్వభుక్తౌ యచ్ఛతో యోగజం ఫలం.

రాహుకేతువులు శుభస్థానములనుండి యితరగ్రహములతో జేరక యున్నయెడల వారు స్వదశాస్వభుక్తులయందే యోగఫలప్రదు లగు చుందురు.

శ్లో. దశేశపాపసంయుక్తశుభభుక్తౌతు మిశ్రితం
పాపస్య చాధికం పాప మసంబద్ధ శ్శుభేప్సితా.

దశానాథుడు పాపుడైనయెడల నాతనితో గలసిన శుభుల యొక్క అంతర్దశలయందు కష్టసుఖమిశ్రమఫలములె గలుగుచుండును. దశాధిపతితో జేరిన పాపులయొక్క అంతర్దశలయందు కష్టము లధికముగా గలుగుచుండును. కాని దశానాథునితో సంపర్కమెంతమాత్రమును లేని శుభులయొక్క అంతర్దశలయందుమాత్రమే శుభము కలుగును.

శ్లో. కేంద్రత్రికోణనేతారౌ పరస్పర మసంయుతౌ
అపస్థానపతిత్వే తు మిథో భుక్తేషు సౌఖ్యదౌ.

కేంద్రకోణాధిపతులకు సంపర్కము లేకున్నను వారలకు యితర పాపాధిపత్యములు లేనియెడల కేంద్రాధిపతి మహాదశయందు కోణాధి పతి భుక్తియందును, కోణాధిపతి మహాదశయందు కేంద్రాధిపతి అంత ర్దశయందును జాతకునకు సౌఖ్యము గలుగుచుండును.

శ్లో. స్వస్వభుక్తౌ దశానాథా న యచ్ఛంతి స్వకం ఫలం
స్వసంబంధిగ్రహాణాం తు భుక్తౌ యోగ్యం దిశంతి హి.

మహాదశానాథుడు స్వభుక్తియందు తన ఫలమును సంపూర్ణ ముగా నీయజాలడు. కాని దశానాథుడు తనతో గలసిన, తన్ను చూచు చుండిన లేక తాను జూచుచుండిన గ్రహములయొక్క అంతర్దశలయందు వారల బలానుసారముగా శుభఫలము నిచ్చువాడగును.

శ్లో. సురేజ్యశుక్రౌ యది కేంద్రనాథౌ చేన్మారకస్థానగతౌ భవేతాం
ఘ్నతస్తతస్సౌమ్యవిధూచరంధ్రపాస్త్రీంద్వదోషత్వముశంతిపీర్యే

గురుశుక్రులు కేంద్రాధిపత్యము గలుగుటచే పాపులైరి. వారలు ద్వితీయసప్తమములందున్నయెడల నెక్కుడు మారకులగుదురు. తదుపరి బుధుడు చంద్రుడును మారకస్థానములనున్న ప్రబలమారకులగుదురు. రవిచంద్రుల కష్టమాధిపత్యదోషము లేదు.

శ్లో. షష్ఠాష్టమవ్యయే నీచదశా నైచ్యవిధాయినీ
లగ్నద్విత్రిచతుర్త్రైకాదశభాగ్యగతాశుభా.

6, 8, 12 స్థానముల నీచయందున్న గ్రహముయొక్క మహాదశ యందు స్వల్పఫలముండును. 1, 2, 3, 4, 9, 11 స్థానములందు నీచం గతుడైన గ్రహముయొక్క మహాదశయందు శుభము గలుగును.

శ్లో. శుభగ్రహదశాయాం తు శుభభుక్తౌ సుఖంసదా
పాపాంతరే కష్ట మాదౌ భవిష్యతి తత శ్శుభం.

శుభకరములగు గ్రహముల దశలయందు శుభులభుక్తులయందును యెల్లప్పుడును శుభమే కలుగుచుండును. పాపుల అంతర్దశలయందు మొదట కష్టమును పిమ్మట శుభమును కలుగును.

శ్లో. పాపగ్రహదశాయాంతు శుభభుక్తౌ శుభాశుభం
కోణేశయుజ్మారకస్య దశా శోకప్రదా భవేత్.

పాపుల మహాదశలయందు శుభులయొక్క అంతర్దశలయందు ముందు కష్టములును, పిమ్మట శుభమును కలుగును. కోణాధిపతులతో సంబంధముగల మారకగ్రహముల అంతర్దశలయందు కష్టమే కలుగు చుండును.

శ్లో. ధర్మేశే మారకస్థేతు జాతభాగ్యం నిరర్థకం
మారకో యది ధర్మస్థో రిపుదార గత శ్శుభః.

నవమాధిపతి మారకస్థానములందుండెనేని భాగ్యముపట్టదు. మారకగ్రహము 6, 7, 8 స్థానముల నున్నయెడల శుభదాయకమగును.

శ్లో. మిథ ష్షష్టాష్టమగయో ర్దశాభుక్త్యోస్తు ఖేటయోః
చోరారినృపభీతి శ్చ బంధునాశో ధనక్షయః.

గ్రహములు ఒకరినొకరు షష్టాష్టమములందున్నయెడల పరస్పర దశాభుక్తులయందు చోరభయము శత్రులవలన అపాయము, రాజదండనము భయము మున్నగునవి కలుగుచుండును.

శ్లో. దశానాథాష్టమస్థాయి పాపఖేటాంతరాగమే
నృపతస్కరరోగాగ్ని శత్రుపీడా ధనక్షయః.

దశానాథునకు 8 ట నున్న పాపగ్రహముల భుక్తులయందు దొంగభయము, శత్రుభయము రోగము మున్నగునవి గలుగును.

శ్లో. దశానాథాష్టమస్థ స్తు శుభే ఖేటాంతరాగమే
ఆదౌ శుభఫలం ప్రోక్త మంత్యే కష్టఫలం బుధైః.

దశానాథునకు 8 ట నున్న శుభగ్రహముయొక్క భుక్తియందు ముందు శుభమును పిమ్మట కష్టమును కలుగును.

శ్లో. భాగ్యస్థసైంహికేయస్య దశాయాం పితృనాశనం
గురుపుత్రాత్మబంధూనాం హానిః స్థాన ధనక్షయః.

రాహువు 9 ట నున్న రాహుమహాదశయందు పితృహానియు, ధనహానియు స్థానభ్రష్టతయు, పుత్రాదుల కరిష్టమును కలుగును.

శ్లో. బుధార్యౌ సప్తమస్థౌ చేత్ రాజతుల్యో భవేన్నరః.
గురురాహుయుతౌ సౌమ్యవీక్షితౌ చ తథావిధౌ.

గురుబుధులుచేరి యేజాతకునకు 7 ట నుందురో వాడు రాజతుల్యుడగుటకు సందేహములేదు. గురురాహువులు చేరియున్నను వారికి శుభుల సంపర్కమున్నను రాజతుల్యయోగము గలుగును.

శ్లో. లాభాధిపే కేంద్రయాతే శుభగ్రహసమన్వితే
ఆగమో రాజభోగ్యానాంవస్తూనాం కేరళోదితః.

లాభస్థానాధిపతి కేంద్రములయందు శుభులతో జేరియుండెనేని జాతకుఁడు రాజభోగముల ననుభవించును.

శ్లో. లగ్నేశే ధనసంయుక్తే ధనేశే లగ్నసంయుతే
జాతః పోష్యసహస్రం తుపుష్ణాత్యేన న సంశయః.

ధనాధిప లగ్నాధిపతు లిరువురును పరివర్తనగా నుండిరేని జాతకుఁడు పెక్కురను పోషించుచుండువాడగును.

శ్లో. రోహిణ్యాం తు స్థితః శ్చంద్రో భార్గవేణ విలోకితః
త్రిషష్టలాభగః క్రూరో జాతం కుర్యాద్ధి భూపతిం

చంద్రుడు రోహిణియందుండి శుభులచే చూడబడినపుడు 3,6, 11 స్థానములందు పాపులున్నయెడల జాతకుఁడు భూమీశుఁడగును.

శ్లో. సప్తమే బుధదేవేజ్యశుక్రాశ్చ ద్రాజయోగదా.
చంద్రధర్మేశ్వరౌ విత్తేసంయుతౌ రాజయోగదా.

సప్తమమునందు బుధగురు శుక్రులు చేరిన రాజయోగము గలుగును. ద్వితీయమున భాగ్యాధిపతి చంద్రునితో గలసియున్న రాజయోగము గలుగును.

శ్లో. పితా గురు రదృష్టం చ భాగ్యం నవమ ముచ్యతే
భావేశయో శ్శుభత్వే తు జాతకే తచ్ఛుభాచ్ఛుభం.

తొమ్మిదవభావమువలన తెలియదగినవి తండ్రి, గురువు, దైవము అదృష్టము, భాగ్యముమున్నగునవిగానున్నవి కావున నవమము, నవమాధిపతి శుభులైనజాతకునకు శుభఫలములు కలుగునని నిర్ణయింపవలసియున్నది.

శ్లో. పితృస్థానేశసంయుక్త పాపద్రగ్రహదశాగమే
పితృమారకభుక్తౌ తు కర్మేశస్య పితు ర్మృతి.

భాగ్యాధిపతితో గలసినపాపుల దశయందుగాని పితృమారక గ్రహముయొక్క అంతర్దశయందుగాని పితృమారకము జరుగును.

శ్లో. దుఃస్థానస్థితపిత్రీశదశాయాం పితృనాశనం
పితృకారకసంయుక్త పాపగ్రహదశాసువా?

దుస్థానములందున్న పితృస్థానాధిపతియొక్క మహాదశయందు గాని పితృకారకునితో గలసినపాపుల మహాదశయందుగాని పితృమారకము జరుగును.

శ్లో. పితృస్థానాధిపే జీవే దుష్టస్థానగతే యది
క్రూరగ్రహై శ్చ సందృష్టే తద్దశా పితృనాశనీ.

నవమాధిపతియైన గురుఁడు దుస్థానములందుండి క్రూరగ్రహములచే చూడబడుచున్నయెడల గురుమహాదశయందు పితృమారకము గలుగును.

శ్లో. స్థానేశకారకౌ యుక్తౌ నవపంచనఁగౌ యది
దుర్దశ క్రూరసంయోగే గర్భస్థస్య పితు ర్మతిః.

పితృకారకుఁడు పితృస్థానాధిపతితోగలసి పంచమమందుగాని నవమమందుగాని యుండి 6, 8, 12 స్థానాధిపతులతోగాని క్రూరులగు నితరగ్రహములతోగాని సంపర్కము గల్గియున్నయెడల జాతకుఁడు గర్భమందుండగనే జాతకునితండ్రి మరణించును.

శ్లో. మాతృకారక ధర్మేశౌ యుక్తౌ పాపసమన్వితౌ
జాతమాత్ర స్తు హం త్యేవ పితరం పుత్రకోభువి.

చతుర్థాధిపతియు నవమాధిపతియు కలసి పాపులతో జేరినయెడల జాతకుడు జనించనతోడనే యాతనితండ్రి చనిపోవును.

శ్లో. స్వోచ్చ మూలత్రికోణస్థే భాగ్యే శే బలసంయుతే
పితృకీర్తి ప్రకాశ శ్చ ధర్మకర్మాణ్యథాచరేత్.

నవమాధిపతి యుచ్ఛయందుగాని మూలత్రికోణమునందుగాని తనక్షేత్రములందుగాని బలయుతుడై యున్నయెడల జాతకుడు తండ్రికి మంచికీర్తిని దెచ్చువాడగును.

శ్లో. సుతేశే తుంగభాగ్యస్థే భాగ్యేశే తుంగపుత్రగే
పితృపుత్రాదిసౌభాగ్యం జాతస్యాస్తీతి నిర్ణయః.

పంచమాధిపతి యుచ్ఛయందుగాని నవమమందుగాని యున్నను, నవమాధిపతి పంచమమందుగాని యుచ్ఛయందుగాని యున్నను జాతకునకు పితృభాగమును పుత్రసంపదయు గల్గియుండును.

శ్లో. చతుర్థలగ్న భాగ్యేశా యది లాభగతా స్త్రయః.
శుభక్షేత్రే ధవా యుక్తా జాత స్స్యా ద్బహుభాగవాన్.

లగ్నచతుర్థభాగ్యాధిపతులు ముగ్గురును కలసి లాభమందుగాని శుభక్షేత్రములందుగాని యున్నయెడల జాతకుఁడధికభాగ్యవంతుడగును.

శ్లో. భాగ్యభాగ్యేశ సంయుక్త ద్రష్టఖేటఖగేషు యః
బలాధిక స్తేన వాచ్యం నాస్తికాస్తిక్యజం ఫలం.

నవమము నవమాధిపతి వీనికిగల బలముల తారతమ్యము ననుసరించి జాతకుని మతాదికములను నిర్ణయింపవలసియుండును.

## దశమభావము.

శ్లో. కర్మేశే దుర్బలే నీచే హ్యస్తగే శత్రుగేహగే
షష్ఠాష్టమవ్యయస్థే వా కర్మహీనో భవేన్నరః.

దశమస్థానాధిపతి దుర్బలుడైనను నీచయందున్నను శత్రుక్షేత్రములందున్నను, 6, 8, 12 స్థానములందున్నను జాతకుడు కర్మవిహీనుడగును.

శ్లో. కర్మే శేఫణిసంయుక్తే కర్మభ్రష్టో భవిష్యతి
కేంద్రకోణోచ్చకలితే స్వక్షేత్రేఽపి చ కర్మఠః.

రాజ్యాధిపతి రాహువుతో గలసిన జాతకుడు కర్మలేనివాడగును. దశమాధిపతి కేంద్రములందుగాని కోణములందుగాని యున్నయెడల జాతకుడు మంచి కర్మకుడగును.

శ్లో. కర్మేశే లాభసంయుక్తే గురుశుక్రయుతేక్షితే
సుకర్మా ధనశాలీ చ ధనాఢ్యశ్చ భవేన్నరః.

దశమాధిపతి లాభస్థానమునందు గురునితో సంబంధము గల్గిన వాడైనయెడల జాతకుడు సత్కర్మగలవాడగును. ధనసంపదగలవాడును అగును.

శ్లో. దశమస్థే దివానాథే తదీశే పంచమాశ్రితే
బుధదృష్టే భవేజ్జాతో గంగాస్నాయీ సుబోధవాన్.

రవిదశయందును దశమాధిపతి పంచమమందును యుండియుండగా వారికి బుధసంపర్కము గల్గినయెడల జాతకుడు మంచి తెలివిగలవాడును తీర్థయాత్రలు చేయువాడును అగును.

శ్లో. కేంద్రత్రికోణం తు గతేతు కర్మపే
దాతా తృతీయేపి చ రాజతుల్యః
గీతానురక్తో మితభోజనశ్చ
శుచి ర్విరక్తో భవితా మనుష్యః.

దశమాధిపతి లగ్నమునగాని ద్వితీయ తృతీయములందుగాని చతుర్థపంచములయందుగాని సప్తమమందుగాని దశమమందుగాని యుండినయెడల జాతకుడు దాతృత్వము గలవాడును, సంగీతమునందిష్టము గలవాడును మితముగా భుజించువాడును వైరాగ్యసంపద గలవాడును అగును.

శ్లో. కర్మస్థానగతే మందే శూద్రమూలా ద్ధనాగమః
స్వర్భానౌ సంస్థితే తత్ర మ్లేచ్ఛమూలా ద్ధనాగమః.

దశమమున శనియున్న జాతకునకు శూద్రులవలన ధనలాభము గలుగును. దశమమందు రాహువున్నయెడల జాతకునకు మ్లేచ్ఛులవలన ధనలాభము గలుగును.

శ్లో. కుజభానూ యుతౌ తత్ర రాజమూలా ద్ధనాగమః
బుధచంద్రౌ యుతౌ రాజ్యే వైశ్యమూలా ద్ధనప్రదా.

రవి కుజునితో గలసి దశమమందున్నయెడల భూపాలురవలన ధనము లభించును. చంద్రుడు బుధునితో గలసి దశమముననున్న వైశ్యుల వలన ధనము లభించును

శ్లో. లగ్నచంద్రార్కరాజేశ నవాంశ. తివృత్తితః
జాతస్య జీవనం వాచ్యం దశమస్థగ్రహై రపి.

లగ్నము చంద్రలగ్నము, సూర్యుడున్నస్థానము వీనిలో నెక్కుడు బలమైనరాశికి దశమమగు స్థానముయొక్క అధిపతి యే నవాంశయం దుండునో యా నవాంశాధిపతియైన గ్రహముయొక్క బలాధిక్యతను బట్టియు, దశమమునందున్న గ్రహముల కారకత్వమును బట్టియు జాతకుండెట్లు జీవించువాడగునో నిర్ణయింపవలయును.

ఏకాదశభావము.

శ్లో. సౌమ్యధ్వజాభ్యా మధలాభగాభ్యాం
హిరణ్య మిందో సితా శ్చ మౌక్తికం
మందేన సర్పేణ తధాయుధంచ
లభే ద్ధి లాభస్థితఖేటవృత్త్యా.

లాభమునందుండు గ్రహముల ననుసరించి జాతకున కేవస్తువులు లభించులో నిర్ణయింపనగును. లాభమున బుధకేతువులలో నెవరున్నను బంగారమును, చంద్రుడుగాని శుక్రుడుగాని యున్నయెడల ముత్యము లును, శనిగాని రాహువుగాని యున్న నాయుధములును లభించును.

శ్లో. లాభాధిపే స్వోచ్చసుహృత్త్రికోణగృహస్థితే సౌమ్యనిరీక్షితేచ
ధర్మే చ కర్మేశ్వరసంయుతేపి జాతస్యవిత్తాప్తిరనంతరూపా.

లాభస్థానాధిపతి యుచ్చయందుగాని స్వక్షేత్రములందుగాని మిత్రక్షేత్రమునందుగాని మూలత్రికోణమందుగాని యుండి భాగ్యరాజ్యాధిపతులచే చూడబడినయెడల జాతకునకు ధన మధికముగా నుండును.

శ్లో. సూర్యే లాభగతేధనం పితృకృతం చంద్రే తు మాతుర్ధనం
భౌమే భ్రాతృధనం బుధే నిగదితం మాతామహాద్ధనం
జీవే పుత్రధనం సితే తు సుదతీమూలాద్ధనం భాస్కరా
భృత్యాద్ధన మామనన్తి ఖచరస్యోక్తైస్తు వీర్యాదిభిః.

లాభమున రవియున్న పితృధనమును, చంద్రుడున్న మాతృధనమును, కుజుడున్న సోదరుల ధనమును, బుధుడున్న మాతామహార్జితమును, గురుడున్న పుత్రార్జితధనమును, శని లాభముననున్న సేవకుల మూలమునను శుక్రుడున్న భార్యవలనను జాతకునకు ధనములభించును.

శ్లో. లాభేశే వ్యస్తగే నీచే విక్రమే పాపసంయుతే
పాపదృష్టియుతే వాపి జ్యేష్ఠవృద్ధి ర్నవిద్యతే.

లాభాధిపతి అస్తంగతుండై యున్నను, నీచయగు తృతీయమందున్నను, పాపులతో గలసియున్నను లేక పాపులచే చూడబడినను జాతకునకు సోదరవృద్ధి యుండదు.

శ్లో. లాభేశే శుభసంయుక్తే బలాఢ్యే శుభవీక్షితే
తత్ క్షేత్రే శుభసంయుక్తే జ్యేష్ఠవృద్ధి ముదీరయేత్.

లాభాధిపతి శుభగ్రహసంబంధముగల్గి బలయుతుండై 11 ట నున్నను, 11 ట శుభులున్నను జాతకుని జ్యేష్ఠసోదరులకు వృద్ధి గలుగగలదు.

## ద్వాదశభావము.

శ్లో. క్రూరే వ్యయేశే వ్యయగేచ పాపే నీచారిగే క్రూరయుతేచదృష్టే
అసద్వ్యయఃక్రూరగుణోమనుష్యోదారిద్ర్యమాప్నోతిజనైర్విరోధం.

ద్వాదశాధిపతి క్రూరగ్రహమైనను ద్వాదశమునందు పాపులున్నను, 12 స్థానాధిపతి నీచయందుగాని శత్రుక్షేత్రములందుగాని క్రూరులతో గలసియున్నను జాతకుఁడు దుర్వ్యయము చేయువాఁడగును.

శ్లో. వ్యయాధిపే సౌమ్యఖగే వ్యయస్థే మిత్రాలయే కంటకకోణభేషు,
ధర్మేశకర్మేశ్వరయుక్తదృష్టే మితవ్యయీ సర్వగుణాభిరామః

12 స్థానాధిపతి శుభుఁడై మిత్రులయిండ్లయందుగాని కేంద్రకోణములయందుగాని యుచ్ఛయందుగాని యుండి భాగ్యరాజ్యాధిపతుల సంబంధము కలిగినయెడల ద్వాదశమందు శుభు డున్నయెడల జాతకుఁడు న్వయముచేయువాఁడై గుణవంతుఁడై జనుల పొగడ్తల కెక్కును.

శ్లో. యద్భావేశస్థితో రిష్ఫే యజ్జాతిస్త్రీ పుమానపి
తచ్ఛీలానుగుణం వాచ్యం జాతస్యధననాశనం.

12 ట నేభావాధిపతి యుండునో లేక ద్వాదశాధిపతిగాని, ద్వాదశమందున్నవాఁడుగాని ద్వాదశాధిపతితో గలిసియుండువాఁడుగాని వీరలలో నెక్కుడు బలముగలవాఁడు యేభావమున కధిపతియో యే కారకుఁడో విచారించి స్త్రీ పురుషులకు యేవిధముగా ధనము గలుగునో యూహింపవలయును.

శ్లో. ఇత్థం ద్వాదశభావానాం సామాన్యఫల మీరితం
గోపాలదైవజ్ఞేనేదం గోపాల స్తేన తుష్యతు.

గోపాలదైవజ్ఞునిచే రచింపబడిన గోపాలరత్నాకరమున ద్వాదశభావఫలములును సామాన్యముగా జెప్పబడెను. ఇద్దానివలన గోపాలదేవుడు సంతుష్టినొందుగాక.

సంపూర్ణము.

# జాతకకళానిధి.



శ్లో. శ్రీమూర్తిరూపిణం దేవం త్రయీవేద్యం శుభావహమ్
త్రిగుణాతీత మవ్యక్తం వందే సూర్యం సదావిభుమ్
రవ్యాదిగ్రహచారేణ వక్ష్యహం భావజం ఫలం.

## లగ్నాదిరవిఫలం.

లగ్నే రవిః—ఆరోగ్యం భవతి, పైత్యదేహీ, నీలమేఘనయనః, నేత్రరోగీ, మేధావీ, సదాచారపరః; ఉష్ణశరీరః, చంచలచిత్తవాన్ ఉదారః, శూరః, లజ్జాహీనః.

రవి మొదలుగాగల గ్రహములు చారవశమున నేభావమునం దుండ నేఫలమొసంగుదురో వివరించుచున్నాడను.

లగ్నమున రవియున్న, ఆరోగ్యముగలుగును. పైత్యతత్వము గలవాడగును. నల్లని నేత్రములు గలవాడగును. నేత్రరోగియగును. బుద్ధిమంతుడగును. ఆచారవంతుడగును. వేడిశరీరముగలవాడును, చలచిత్తుడును, ఉదారుడును, శూరుడును, లజ్జలేనివాడును అగును.

ద్వితీయేరవిః—ముఖరోగీ, రాజదండనవ్యయచ్ఛేదః, పాపయుతే నేత్రరోగః, విద్యావిఘ్నః, మూర్ఖకోపః.

ద్వితీయమున రవియుండ ముఖరోగముగలవాడును, రాజదండనముచే ధనవ్యయముకలవాడును, విఘ్నమైన విద్యగలవాడును, మూర్ఖమైన కోపముగలవాడును అగును. ద్వితీయమున రవి పాపులతో గలసియున్న నేత్రరోగియగును.

తృతీయేరవిః—బుద్ధిమాన్, సాహసికః, ధనధాన్యవాన్, అనుజత్వం నాస్తి, గోత్రసమృద్ధిః, అతిక్రూరః.

తృతీయమున రవియున్న బుద్ధిమంతుడును, సాహసము కలవాడును, ధనధాన్యముగలవాడును, సోదరులులేనివాడును, గోత్రసమృద్ధి గలవాడును, అతిక్రూరుడును అగును.

చతుర్థేరవిః—అంగవిహీనః, మనఃపీడా, అకారణేన జనైవిరోధః, బంధుద్వేషీ, జన్మభూమి పరిత్యాగః.

చతుర్థమున రవియున్న అంగహీనుడును, మనస్సునకు శాంతి లేనివాడును, నిష్కారణముగా జనులతో విరోధము జెందువాడును అగును.

పంచమేరవిః—నిర్ధనః, స్వల్పపుత్రః, దేవతానుగ్రహేణ పుత్రోత్పత్తిః, హృద్రోగీ, పితురారిష్టం, బృహత్కుక్షిః, కర్మవిఘ్నః.

పంచమమున రవియున్న నిర్ధనుడును, కొలదిమంది పుత్రులుగలవాడును, దేవతానుగ్రహమున పుత్రుల బడసినవాడును, హృదయరోగముగలవాడును, తండ్రికనిష్టము గలుగజేయువాడును, పెద్దకడుపుగలవాడును, కర్మలకు విఘ్నము గల్గించువాడును అగును.

షష్ఠేరవిః :—అల్పజ్ఞాతిః, శత్రుక్షయ, పౌత్రదర్శనః, గళితకౌపీనః, మతిమాన్, బలవాన్, అరిమర్దనః.

షష్టమమున రవియున్న కొద్దిమంది జ్ఞాతులుగలవాడును, శత్రునాశనము సేయువాడును, మనుమలజూచువాడును, కౌపీనముధరింపనివాడును, బుద్ధిమంతుడును, పుత్రవంతుడును, బలుడును శత్రువుల మర్ధించువాడును అగును.

సప్తమేరవిః :—వివాహవిళంబం, స్త్రీద్వేషీ, పరదారరతః, దేశాంతరసంచారః, అన్యగృహభక్షకః, స్త్రీమూలాద్యైశ్వర్యం, స్త్రీవావార్తానుసారి.

ఏడింట రవియున్న నాలస్యముగా వివాహమగువాడును, స్త్రీలను ద్వేషించువాడును, పరస్త్రీగమనముజేయువాడును, దేశసంచారము

చేయువాడును, యితరులయిండ్ల భుజించువాడును, స్త్రీవలనధనప్రాప్తి గలవాడును, స్త్రీలుచెప్పినట్లు నడచువాడును అగును.

అష్టమేరవిః :—అల్పపుత్రః పూర్ణాయుః, నేత్రరోగః, దుర్బల శరీరః. ధర్మలేశోనాస్తి.

ఎనిమిదింట రవియున్న తక్కువమంది కుమారులు గలవాడును, పూర్ణాయుర్దాయముగలవాడును, నేత్రరోగియు, దుర్బలమైన శరీరము గలవాడును, ధర్మబుద్ధిలేశమును లేనివాడును అగును.

నవమేరవిః :—రవ్యాదిదేవతాభక్తిః, ధార్మికః, తపస్వీ, అల్ప భాగ్యం, సుపుత్రవాన్, సుఖీ, పితృద్రవ్యహా, స్వార్జితధనః, కలహాగ్రంధి రోగః, కృషిలాభః.

తొమ్మిదవయింట రవియున్న సూర్యాదిదేవతాభక్తుడును, ధార్మి కుడును, తపస్వియు, అల్పమగుభాగ్యము గలవాడును, మంచికుమారులు గలవాడును, సౌఖ్యవంతుడును, పితృధనము, స్వార్జితమును కలవాడును, కలహాగ్రంధిరోగియు, వ్యవసాయమున లాభముపొందువాడును అగును.

దశమేరవిః :—సుప్రసిద్ధః, ద్రవ్యార్జనసమర్థః, దృఢగాత్రః, విద్వాన్, సాహసికః, గానవిద్యాలోల, నగరకర్తా, సుపుత్రవాన్.

పదవయింట రవియున్న ప్రసిద్ధపురుషుడు, ద్రవ్యార్జనచేయువా డును, దృఢమైన శరీరముగలవాడును, విద్వాంసుడును, సాహసియు, సంగీతప్రియుడు, నగరాధికారియు, మంచికుమారులు గలవాడునుఅగును.

ఏకాదశేరవిః :—బహుధనవాన్, ఆందోళికాప్రాప్తిః, దృఢ చిత్తః, విఖ్యాతః, శత్రుబాహుళ్యవాన్, దృఢగాత్రః, న్యాయార్జితధనః.

పదునొకండవయింట రవియున్న ధనవంతుడు, పల్లకినెక్కువాడు, దృఢమనస్కుడు, ప్రసిద్ధుడు, శత్రువులెక్కువగా గలవాడును, దృఢశరీ రముగలవాడును, న్యాయముగా ధనమార్జించువాడును అగును.

ద్వాదశేరవిః :—పతితః, విశాలాంగః, విధవాసంగమః, ధన హీనః, చోరః.

పంౘెండవయింట రవియున్న పతితుఁడును, విశాలమగు అంగము గలవాడును, వితంతువులతో గలియువాడును, దరిద్రుడును, దొంగ తనముచేయువాడును అగును.

లగ్నాది చంద్ర ఫలం.

లగ్నే చంద్రః :—కురూపవాన్, వ్యాధిపీడితవాన్, జలోదనాన్న భక్షకః, జలరోగీ, వాతప్రకృతిదేహః; కృషిఫలః, కర్ణగుహ్యాగ్రంధిః, శాస్త్రవాన్, సహోదరవాన్, ఉన్మత్తః, అతిమూర్ఖవాన్ భవతి.

ప్రథమమున చంద్రుడున్న కురూపియు, వ్యాధిపీడితుడును, జలోదనాన్న భక్షణసేయువాడును, జలరోగియు, స్థూలకాయుడును, వాత తత్త్వముగలవాడును, వ్యవసాయముచేయువాడును, కర్ణగుహ్యాగ్రంధి యుతుడును, శాస్త్రవేత్తయును, సోదరులుగలవాడును, పిచ్చివాడును అతిమూర్ఖుడును అగును.

ద్వితీయేచంద్రః :—శోభనవాన్, బుద్ధిమాన్, ధనవాన్, రాజ పూజ్యః, పాపయుతే విద్యావిఘ్నం, సత్కుటుంబవాన్, ముఖసౌందర్య వాన్, మృదుభాషీ, వక్రదృష్టియుతనేత్రః.

ద్వితీయమున చంద్రుడున్న బుద్ధిమంతుడును, ధనవంతుఁడును, రాజగౌరవముగలవాడును, శుభములు కావించువాడును అగును. ఆ చంద్రుఁడు పాపులతోఁ గలసియున్న విద్యకు విఘ్నము కలిగించును. సత్కుటుంబముగలవాఁడును, సుందరమైనముఖముగలవాడును, మృదువుగా మాటలాడువాడును, వక్రమైనదృష్టితోఁగూడిన నేత్రములుగల వాఁడును అగును.

తృతీయేచంద్రః :—వాతపీడితదేహః, మూలరోగీ, స్వల్పస్తన్య పానః, కృశః, కర్మవిఘ్నః, బహుభ్రాతృవాన్, విద్వాన్, ప్రతాపీ.

మూడవయింట చంద్రుడున్న వాతపీడితదేహుండును, మూల వ్యాధియుతుండును, స్తన్యమును స్వల్పముగా గ్రోలినవాడును, కృశించి నవాడు, కర్మవినాశకుండును, ఎక్కువమంది సోదరులు కలవాడును, విద్వాంసుండును, ప్రతాపములు పలుకువాండును అగును.

చతుర్థే చంద్రః :—అశ్వారూఢః, గంధమాల్యాంబరప్రియః, బహుపోషకః, విద్యావినయసంపన్నః.

చతుర్థమున చంద్రుడున్న గుర్రము నెక్కువాడును, సుగంధ ద్రవ్యములు పుష్పములు, వస్త్రములు మున్నగువానియం దెక్కువ యిష్టముగలవాడును, అనేకమందిని పోషించువాడును, విద్యావినయ ములు గలవాడును అగును.

పంచమేచంద్రః :— చతుష్పదానిలాభః, భార్యా రూపవతీ, క్షీరసమృద్ధిః, మాయావీ, మంత్రోపాసకః, డాంబికః, బహుపుత్రవాన్, విద్యావిఘ్నః.

అయిదింట చంద్రుడున్న పశుసమృద్ధిగలవాడును, సుందరమైన భార్యగలవాడును, పాలనెక్కుడుగాగలవాడును, మాయావియు, మం త్రోపాసనాపరుడును, డాంబికుండునును, అనేకమంది కుమారులు గల వాడును, విద్యాభ్యాసమునకు విఘ్నముసేయువాడును అగును.

షష్ఠేచంద్రః :—అతిదరిద్రః, వితంతుసంగమీ, ధనహీనః చో రః, మద్యపానరతః; అకారణేజనవిరోధః, బాల్యే అన్యస్త్రీ స్తన్యపానం కరోతి, జ్ఞాతిశత్రుపీడాకరః, మేధావీ.

ఆరింట చంద్రుడున్న దరిద్రుడును, వితంతువులతో సంగమము చేయువాడును, ధనహీనుడును, చోరుడును, కల్లుద్రావువాడును, అకా రణముగా జనవిరోధమును బడయువాడును, బాల్యమున అన్యస్త్రీ స్తన్య మువలన పోషింపబడినవాడును, జ్ఞాతులను శత్రువులను పీడించువాడును బుద్ధిమంతుడును అగును.

సప్తమేచంద్రః:—స్త్రీలోలః, ధూర్తః, ఉత్తమాంగనాసంసిద్ధిః సత్కుటుంబవాన్, శుభ యుతే యేకాభార్యా, పాపయుతే దారయుగ్మంభవతి, కటగ్రంధిః, కుజయుక్తశ్చేత్ కార్ముకగ్రంధిః.

ఏడింట చంద్రుడున్న స్త్రీలోలుడును, ధూర్తుడును, ఉత్తమాంగనలను పొందువాడును, కుటుంబీకుడును అగును. చంద్రు డేడింట శుభునితో గూడియున్న జాతకునకు ఒక భార్య యుండును, పాపులతో గలసియున్న యెడల యిరువురుభార్యలు గలవాడును అగును.

అష్టమేచంద్రః:—అల్పపుత్రః, పిత్తశరీరః, వ్యాధిపీడా, నేత్రరోగః, కృశః, మాతారిష్టం, నోచేన్మాతృపక్షవిరోధః, పాపయుతే బాలారిష్టం, శుభయుతే, శుభవీక్షణాత్తత్పరిహారః.

ఎనిమిదవయింట చంద్రుడున్నయెడల కొద్దిమందిపుత్రులుకలవాడును, పైత్యతత్త్వము గలవాడును, వ్యాధిపీడితుడును, నేత్రరోగియు, కృశించినదేహము గలవాడును, లల్లికపకారముచేయువాడును, తల్లిపక్షమువారితో విరోధించువాడును అగును. ఆ యష్టమమున పాపులతో గూడిన చంద్రుడున్న బాలారిష్టము కలుగును. అందు శుభులతో గూడియున్నను, శుభులచే చూడబడినను ఆదోషము పరిహారమగును.

నవమేచంద్రః:—బహుశ్రుతవాన్, బుద్ధిమాన్, కూపగోపురారామాదిప్రతిష్ఠాసిద్ధిః, ధనధాన్యగ్రామసిద్ధిః, పుత్రవాన్, బహుభాగ్యకరః, ద్విజగురుపూజకః, కృషిఫలం, శూరః, క్షీణేపాపయుతేబాలారిష్టం, శుభయుతే పరిహారః.

తొమ్మిదవయింట చంద్రుడున్నయెడల విఖ్యాతిగలవాడును, బుద్ధిమంతుడును, నూతులు మున్నగునవి ప్రతిష్ఠించువాడును, ధనధాన్యాదిలాభంబును, సంతానలాభమును, ఎక్కువభాగ్యమును, బ్రాహ్మణగురుభక్తియు, వ్యవసాయలాభమును, శూరుడును అగును. అందు

పాపులతో గలసియున్న బాలారిష్టము, శుభులతో గూడియున్న బాలారిష్టపరిహారమగును.

దశమేచంద్రః:—కామాతురః, విధవాసంగమీ, కార్యవాదీ, ధనాఢ్యః, దీర్ఘాయుః, ఉద్యోగీ, దేవాలయ తటాకాధికారీ, స్త్రీవిరోధీ, సజ్జనభక్తః,

పదవయింట చంద్రుడున్నయెడల కామాతురుడును విధవాసంగమము చేయువాడును, కార్యవాదియు, ధనవంతుడును, దీర్ఘాయుర్దాయము గలవాడును, ఉద్యోగముచేయువాడును, దేవాలయాదికముల కధికారియు, స్త్రీజనవిరోధియు, సజ్జనవిధేయుడును అగును.

ఏకాదశేచంద్రః:—బహుశ్రుతవాన్, పుత్రవాన్, పరోపకారీ విద్యావిచక్షణః, కీర్తిమాన్, ద్రవ్యలాభః, కృషిబాహుళ్యః, ధనదాతా న్యాయార్జనపరః.

ఏకాదశమున చంద్రుడున్న యెడల బహుశ్రుతుడును, పుత్రవంతుడును, పరోపకారియు, విద్యాసంపన్నుడును, సంపదయుతుండును, కీర్తి గలవాడును, ధనలాభముజెందువాడును, వ్యవసాయముచేయువాడును ఋణముల నిచ్చువాడును, న్యాయముగా ధన మార్జనచేయువాడును అగును.

ద్వాదశేచంద్రః:—దురోభ్భజనం, గోత్రసమృద్ధిః, అంగహీనః, క్షుద్రగుణవాన్.

పండ్రెండవయింట చంద్రుడున్నయెడల దురాన్నముల భుజించువాడును, గోత్రసమృద్ధిగలవాడును, అంగహీనుడును, క్షుద్రగుణములు గలవాడును అగును.

## లగ్నాధికుజఫలం.

లగ్నేకుజః—దేహవ్రణవాన్, దృఢగాత్రః, చోరబుద్ధిః, బృహన్నాభిః, రక్తవర్ణః, బాల్యే పితృపీడా,

లగ్నమున కుజుడున్నయెడల దేహమున వ్రణములుగలవాడును, దృఢశరీరుడును, చోరబుద్ధిగలవాడును, ఎఱ్ఱని వర్ణములు గలవాడును, బాల్యమున తండ్రి కరిష్టము గలుగజేయువాడును అగును.

ద్వితీయేకుజః—వాక్పారుష్యం, అపాత్రే వ్యయకరః, గళిత కోపీతః, అతికోపీ, పిత్రార్జితభూమిభూషణవాన్, విద్యావిఘ్నః.

ద్వితీయమున కుజుడున్న వాక్పారుష్యముగలవాడును, అపాత్ర దానము చేయువాడును, ఎక్కువ కోపముగలవాడును, పిత్రార్జితధనము గలవాడును, విఘ్నమైనవిద్య గలవాడును అగును.

తృతీయేకుజః—అనుజత్వం నాస్తి, ద్రవ్యాభావః, రాహుయుక్త శ్చేత్ వ్యభిచారీ, వేశ్యాసంభోగః సాహసికః శూరః, భ్రాతృహంతా, శత్రుహంతా, బహునిష్ఠుర, జ్ఞాతివృద్ధిః.

తృతీయమున కుజుడున్నయెడల సోదరులు లేనివాడును, ద్రవ్య హీనుడును అగును, తృతీయమున రాహువుతో గూడియున్న జారుడును, వేశ్యతో గలియువాడును, సోదరులను శత్రువులను వధించు వాడును, జ్ఞాతివృద్ధిగలవాడును అగును.

చతుర్థేకుజః—పిత్రారిష్టం, మాతృశరీరే రోగపీడా, సౌమ్య యుతే నిశ్చయం భవతి, గృహచ్ఛిద్రం, నరవాహనః, పరాధీనవాన్, స్త్రీహంతా.

చతుర్థమున కుజుడున్నయెడల తండ్రి కరిష్టము గలుగజేయు వాడును, తల్లికి అనారోగ్యము కలుగజేయువాడును, అందు సౌమ్యు లతో గూడియున్న నిశ్చయముగా గృహచ్ఛిద్రములు గలుగజేయు వాడును, నరవాహన మెక్కువాడును, స్త్రీలనువధించువాడును అగును.

పంచమేకుజః—పుత్రాభావః, దుర్మార్గః, రాజకోపః, మృత పుత్రవాన్.

పంచమమున కుజుడున్న యెడల నపుత్రకుఁడును, దుర్మార్గుడును, రాజులచే కోపింపబడినవాడును, చనిపోయిన పుత్రులు గలవాడును అగును.

షష్ఠేకుజః—ధనవృద్ధిః, ధాన్యవృద్ధిః, శత్రుక్షయః, భూలాభవాన్, రాజసేవా, జ్ఞాతిశత్రుపీడా.

షష్ఠమమున కుజుడున్న యెడల ధనవంతుడును, ధాన్యసంపద గలవాడును, శత్రువుల నాశనము సేయువాడును, భూములను సంపాదించువాడును, రాజోద్యోగియు, జ్ఞాతులకు అరిష్టము కలుగజేయువాడును అగును

సప్తమేకుజః—దారపీడా, పాపయుతే హానిః, శుభయుతే జీవతి దారాద్వయం, ఉదరరక్తం, పాణిరోగః, బహుపుత్రవాన్ బుద్ధిబాహుళ్యం. బహుమాతులః.

ఏడవయింట కుజుడున్న యెడల భార్య కరిష్టము కలుగజేయువాడును, పాపులతో నాయింటనున్న కళత్రహానియు, శుభులతో నున్న యెడల యిద్దరుభార్యలు గలవాడును, ఎక్కువమంది కుమారులు గలవాడును, బుద్ధిమంతుడును ఎక్కువమంది మేనమామలు గలవాడును అగును.

అష్టమేకుజః—అల్పపుత్రః, కించిన్నేత్రరోగః, మధ్యమాయుః, పితృపితామహాదిపీడా, మాతులహంతా, వేశ్యాసంభోగః.

ఎనిమిదవయింట కుజుఁడున్న యెడల కొద్దిమందిపుత్రులు గలవాడును, కొలదిగా నేత్రరోగము గలవాడును, మధ్యాయుర్దాయము గలవాడును, తండ్రితాతల కరిష్టము గలుగజేయువాడును, మేనమామలకు మారకుడును, వేశ్యాసంభోగము సేయువాడును అగును.

నవమేకుజః—ఆరామచ్ఛేత్తా, పితృరోగః, సేవకావృత్తిః, క్రూరకర్మప్రేష్యః, నౌకావ్యాపారవాన్.

తొమ్మిదవయింట కుజుఁడున్నయెడల తోటలను నరికించువాడును, తండ్రికి కష్టము కలుగజేయువాడును, సేవకావృత్తియం దుండువాడును, క్రూరకర్మల ప్రేరేపణచేయువాడును, నావవ్యాపారముచేయువాడును అగును.

దశమేకుజః:—ద్రవ్యార్జనసమర్థః, దృఢగాత్రః, కులదీపకః, నగరకర్తా, స్వార్జితధనః, దేవాలయాధికారీ, బహుధనసంపాదకరః, ధాన్యవృద్ధిః.

పదింట కుజుఁడున్నయెడల ధనార్జనసేయువాడును, దృఢమైన శరీరముగలవాడును, కులదీపకుఁడును, స్వార్జితముగలవాడును, దేవాలయముల కధికారియు, ఎక్కువధనమున కధికారియు, ధాన్యవృద్ధిగలవాడును అగును.

ఏకాదశేకుజః:—బహుశ్రుతవాన్, భూలాభవాన్, మాయావీ, బహుజ్యేష్ఠభ్రాతా, న్యాయార్జితధనవాన్, కృషిసమృద్ధిః.

పదునొకండవయింట కుజుఁడున్నయెడల భూములను సంపాదించువాడును, మాయావియు, అగ్రసోదరులుగలవాడును, న్యాయముగా ధనసంపాదన సేయువాడును అగును.

ద్వాదశేకుజః:—ద్రవ్యాభావః, వాతపీడితదేహః, పరవంచకః సర్వశత్రు, కేతుయుతశ్చేత్ గృహదాహః, దారహానిః, శుభవీక్షణాత్తత్పరిహారః,

పండ్రెండయింట కుజుఁడున్నయెడల దరిద్రుండును, వాతపీడితశరీరుడును, ఎక్కువవంచకుఁడును, ఎక్కువమంది శత్రువులుగలవాడును అగును. శుభులచే చూడబడిన పాపపరిహారమగును.

## లగ్నాధిబుధఫలం.

లగ్నేబుధః:—బహుశత్రువాన్, మంత్రవాదీ, పిశాచోచ్చాటనసమర్థః, బుద్ధిమాన్, విద్వాన్, జ్యోతిషజ్ఞానశీలః, కావ్యగణితః దీర్ఘాయుః, రాజసమః,

లగ్నమున బుధుడున్నయెడల శత్రువు లెక్కుడుగాగలవాడును, మంత్రములెఱింగినవాడును, భూతవైద్యుడును, బుద్ధిమంతుడును,విద్వాంసుడును, జ్యోతిష్కుడును, కావ్యగణిత మెఱింగినవాడును, దీర్ఘాయువు గలవాడును రాజసముడును అగును.

ద్వితీయేబుధః:—పుత్రసమృద్ధిః, వేదశాస్త్రవిచక్షణః, మృదుభాషి, సంకల్పసిద్ధిః, ధనిక, స్వార్జితధనః, ధాన్యసంగ్రహవాన్.

ద్వితీయమున బుధుడున్న పుత్రులుగలవాడును, వేదశాస్త్రము లెఱింగినవాడును, మృదువుగా మాట్లాడువాడును, సంకల్పసిద్ధుండును, ధనవంతుడును స్వార్జితధనంబుగలవాడును, ధాన్యసమృద్ధిగలవాడును, అగును.

తృతీయేబుధః:—సౌభ్రాతృత్వకరః, బహుసౌఖ్యం స్త్రీలాభః, సహోదరవాన్.

తృతీయమున బుధుడున్న సోదరులెక్కువగాగలవాడును, సౌఖ్యములనుభవించువాడును, మంచిభార్యగలవాడును అగును.

చతుర్థేబుధః:—పండితః, హస్తచాతుర్యవాన్, కృషిపరః, విద్యాయుక్తః, వినయః, కుటిలవాహనధాన్యవాన్.

చతుర్థమున బుధుడున్నయెడల పండితుండును, చాతుర్యముగలవాడును, వ్యవసాయము సేయువాడును, విద్యగలవాడును, వినయముగా నుండువాడును అగును.

పంచమేబుధః:—మాతులగండం, పితృరోగం, మాతులపీడా, మాతృదేహే నసౌఖ్యం. రాజపూజ్యః, నానావస్త్రప్రియః, విద్యావాన్ డాంబికః, కలహప్రియః.

పంచమమున బుధుడున్నయెడల మేనమామకు హానిగావించువాడును, మేనమామగండమున బుట్టినవాడును, తండ్రికి కష్టము గలుగ జేయువాడును, తల్లిదేహమున కనారోగ్యమును గలిగించువాడును

రాజుచే పూజింపబడువాడును, అనేకరకములగు వస్త్రములందు యిష్ట పడువాడును అగును.

షష్ఠేబుధః :—రాజపూజ్యః, విద్యావిఘ్నః, డాంబికః, కలహప్రియః, కుటిలహృదయః, శత్రుక్షయః, మాతృహానిః, పాదాంగుష్ఠాది రోగః, ద్రవ్యనాశః.

ఆరింట బుధుడున్నయెడల రాజపూజ్యతయు, విద్యావిఘ్నమును కలుగును. మరియు డాంబికుడును, కలహప్రియుడు, కుటిలహృదయుడును, శత్రునాశనము చేయువాడును, మాతృనాశనకరుడును, పాదాంగుష్ఠాదిరోగముగలవాడును ద్రవ్యమును పాడుచేయువాడును అగును.

సప్తమేబుధః :—మాతృసౌఖ్యం, అశ్వాధిరూఢః, దేహసౌఖ్యం, దృఢగాత్రః, ధర్మజ్ఞః, స్త్రీధనభోగీ.

సప్తమమందు బుధుడున్న మాతృసౌఖ్యమును, అశ్వాదివాహన సౌఖ్యమును, దేహసౌఖ్యం, దృఢమైనశరీరము, స్త్రీధనభోగములును కలుగును. మరియు ధర్మజ్ఞుడగును.

అష్టమేబుధః :—దీర్ఘాయుః, భూక్షేత్రసిద్ధిః, సంపన్నః, అల్పపుత్రః, ప్రసిద్ధగుణః.

అష్టమమున బుధుడున్నయెడల దీర్ఘాయువును, భూలాభమును కలుగును. మరియు సంపన్నుడగును. అల్పసంఖ్యగల పుత్రులుందురు. ప్రసిద్ధమైన గుణములుకలవాడగును.

నవమేబుధః :—బహుప్రజాసిద్ధిః, గీతపాఠకః, దాక్షిణ్యవాన్, నృత్యగీతాదివాద్యప్రియః, పరస్త్రీరతః.

నవమమున బుధుడున్నయెడల జనవశ్యమును, సంగీతపాఠకుడును, దయగలవాడును, నృత్యగీతాదులయందు యిష్టముకలవాడును పరస్త్రీలను పొందువాడును అగును.

దశమేబుధః :—బహుమంగళప్రదః, శుభప్రదః, కర్మసిద్ధిః, ద్రవ్యార్జనపరః, అక్షిరోగి, యోగీ, యజ్ఞరతః, వ్యవహారకర్తా.

దశమమందు బుధుడున్న మంగళప్రదుడును, శుభమొసగూర్చు వాడును, కర్మసిద్ధికలవాడును, ధనసంపాదన చేయువాడును, నేత్రరోగి, యోగియు, యజ్ఞములందు యిష్టతగలవాడును, వ్యవహారకర్త యగును.

ఏకాదశేబుధః :—బహుమంగళప్రదః, ధనధాన్యసమృద్ధిః కృషి విస్తారవాన్, గణకః.

ఏకాదశమందు బుధుడున్న యెడల మంగళప్రదమైనవాడును, ధనధాన్యసంపదగలవాడును, వ్యవసాయము చేయువాడును గణితజ్ఞుడును అగును.

ద్వాదశేబుధః :—జ్ఞానవాన్, రవియుతేచలచిత్తః, బహుప్రియ కరః, కామాతురః, అల్పపుత్రః, అన్యగృహవాసీ, మాతృహంతా.

పంద్రెండవయింట బుధుడున్న యెడల జ్ఞానియగును. అందు రవితోగూడియున్న చలచిత్తుడును, ఎక్కువమంది జనులకు యిష్టుడును, కామాతురుడును, కొద్దిమంది పుత్రులుగలవాడును, అన్యగృహముల నివసించువాడును, తల్లిని వధించువాడును అగును.

## ల గ్నా ధి గు రు ఫ ల ం.

లగ్నేగురుః—స్వక్షేత్రస్థితశ్చేత్ శబ్దశాస్త్రాధికారీ, బహుపుత్ర వాన్, సుఖీ, విద్వాన్, ప్రభుః, దీర్ఘాయుః, రాజపూజ్యః, చతురః.

లగ్నమున గురుడున్న యెడల అది గురునకు స్వక్షేత్రమైన శబ్ద శాస్త్రాధికారమును, పెక్కుమంది కుమారులును, సౌఖ్యమును, ప్రభుత్వ మును, దీర్ఘాయువును, రాజపూజ్యతయును చతురత్వమును గలుగును.

ద్వితీయేగురుః—శోభనవాన్, బుద్ధిమాన్, ధనవాన్, స్ఫుట భాషీ, సత్కుటుంబవాన్, మృదుభాషి, శ్రీమాన్, బహుద్రవ్యాధి కారీ, సంచితధనవాన్, బంధుమధ్యే ప్రబలః.

ద్వితీయమున గురుడున్న శుభకరుడును, బుద్ధిమంతుడును, ధన వంతుడును, స్ఫుటముగా మాటలాడువాడును, మంచికుటుంబము గల వాడును, మృదువుగా మాటలాడువాడును, శ్రీమంతుడును, ద్రవ్యాధి కారియు, ధనమును కూడబెట్టువాడును, బంధువులందరిలోన నెక్కువ వాడుగను యుండును.

తృతీయేగురుః—అతిలుబ్ధః, భ్రాతృవృద్ధిః, దాక్షిణ్యవాన్ సంకల్పసిద్ధికృషిపరః, బహుకనిష్టః స్వజనపోషకః.

తృతీయమున గురుడున్న లోభియు, సోదరవృద్ధిగలవాడు, దయ గలవాడును, సంకల్పసిద్ధుడును, కృషికుడును, స్వజనులను పోషించు వాడును అగును.

చతుర్థేగురుః—సుఖీ, బుద్ధిమాన్, క్షీరభాగ్యవాన్, వాహన వాన్, బంధుజనపోషకః, గృహాధికారీ, సుఖీ.

చతుర్థమున గురుడున్న సుఖియు, బుద్ధిమంతుడును, పాలసౌఖ్య మనుభవించువాడును, వాహనయోగము గలవాడును, బంధుపోషకు డును గృహాధికారియు అగును.

పంచమేగురుః—విశాలాక్షః, రాజద్వారేసేనాధిపతిః, అల్పపుత్రః బుద్ధిమాన్, క్రయవిక్రయనిపుణః, పుత్రైశ్వర్యప్రదః.

పంచమమందు గురుడున్నయెడల విశాలములగు నేత్రములు గలవాడును, సేనాధిపతియు, కొద్దిమంది పుత్రులు గలవాడును, వర్త కమునందు నిపుణుడును పుత్రులకైశ్వర్యమిచ్చువాడును అగును.

షష్ఠేగురుః—శత్రుక్షయః జ్ఞాతివృద్ధిః, పౌత్రదర్శనః, హాస్య ప్రియః, ఉదరే అగ్నిమాంద్యాదిరోగః.

ఆఱంట గురుడున్న శత్రుక్షయమును, జ్ఞాతివృద్ధియు, పౌత్రదర్శనము కడుపున నగ్నిమాంద్యరోగమును కలుగును. మరియు నాజాతకుడు హాస్యప్రియుడగును.

సప్తమేగురుః—విద్యావాన్, అభిమానీ, సత్కళత్రవాన్, ప్రబలస్థానేవివాహః, విశుద్ధకళత్రః, యాత్రాసిద్ధిః, వాణిజ్యవృద్ధిః.

సప్తమమందు గురుడున్న విద్యగలవాడును, అభిమానియు, చక్కనిభార్య గలవాడును, గొప్పవారగు అత్తింటివారు గలవాడును, పతివ్రతయగు భార్యగలవాడును, తీర్థయాత్రలు చేయువాడును, వర్తకుడును అగును.

అష్టమేగురుః—నీచకృత్యకారీ, పవిత్రః, వితంతుసంగమీ, నీచాచారః, శూలరోగీ, దీర్ఘాయుః.

అష్టమమునందు గురుడున్న నీచపుపనులు సేయువాడును పతితుడును, వితంతువుల బొందువాడును, నీచములగు ఆచారపద్ధతులుగలవాడును, శూలరోగియు, దీర్ఘాయువుగలవాడును అగును.

నవమేగురుః—ధార్మికః, తపస్వీ, బహుపుత్రః, యజ్ఞకర్తా, అనుష్టానపరః, దానధర్మపరః, ధనికః, పితృదీర్ఘాయుః, ధర్మకార్యాసక్తః.

నవమమున గురుఁడున్న ధార్మికుఁడును, తపస్వియు, ఎక్కువమంది కుమారులుగలవాడును, యజ్ఞముచేయువాడును, అనుష్టానపరుడును, తండ్రికి దీర్ఘాయువు గలుగజేయువాడును, ధర్మకార్యములజేయువాడును అగును.

దశమేగురుః—విద్వాన్, అశ్వాధిరూఢః, బహుధనవాన్, అనేకజనప్రతిష్ఠాసిద్ధిః ధనధాన్యాదిలాభవాన్, యజ్ఞకర్తా, వాహనసిద్ధిః, పుత్రసిద్ధిః, గ్రామణిః, దాసీభృత్యసంగ్రహవాన్, సంచితధనః, సిద్ధారంభః.

దశమమునగురుడున్న విద్వాంసుడును, గుఱ్ఱముమున్నగువాని నెక్కువాడును, ధనవంతుడును, ప్రతిష్ఠగలవాడును. ధనధాన్యసంపద యుతుండును, పరిచారికలుండువాడును, స్వార్జితముగలవాడును, ఆరంభించినపనియందు జయమునుగాంచువాడును అగును.

ఏకాదశేగురుః:—గీతపాఠకః, గజాశ్వవాహానాదిసిద్ధిః, బహుధనవాన్, శుభకర్మవాన్, సంచితధనవాన్, జ్యేష్ఠభ్రాతృజీవనోపాయః.

ఏకాదశమున గురుడున్న సంగీతశాస్త్రజ్ఞుడును, ఏనుగ గుఱ్ఱము మున్నగువాహానములనెక్కువాడును, అగ్రసోదరులకు జీవనోపాయము కల్గించువాడును అగును.

ద్వాదశేగురుః:—పతితః, నిర్ధనః, అల్పపుత్రః, వేశ్యాసంభోగః, గ్రంధివ్రణః సత్పాత్రేవ్యయంకరః విరక్తః, సన్యాసయోగః.

ద్వాదశమున గురుడున్న పతితుడును, నిర్ధనుడును, కొద్దిమంది పుత్రులుగలవాడును, గ్రంధివ్రణముచే పీడితుడును, సత్పాత్రులకిచ్చువాడును, విరక్తుడును, సన్యాసియు అగును.

---

## లగ్నాది శుక్రఫలం.

లగ్నేశుక్రః:—గణికః, దారప్రియవాక్, వస్త్రాలంకారప్రియః గంధమాల్యాంబరప్రియః స్త్రీప్రియః.

తనుస్థానమున శుక్రడున్న గణితజ్ఞుడును, భార్యయెడలను, వస్త్రాలంకారములందు సువాసనద్రవ్యములయందును, స్త్రీలయెడలను యిష్టుడును అగును.

ద్వితీయేశుక్రః:—శోభనవాన్, బహుకుటుంబీ, సౌఖ్యభోజనః, ఉత్తమాంగనాసిద్ధిః, బృహన్నేత్రః- సుఖీ- ముఖసౌందర్యవాన్, స్త్రీవిరోధః, విద్యావినయసంపన్నః.

ద్వితీయమున శుక్రుడున్న యెడల శుభకార్యములొనర్చువాడును పెద్దకుటుంబముగలవాడును, సౌఖ్యభోజనముగలవాడును, గొప్పయింటి స్త్రీలతో కలియువాడును, పెద్దనేత్రములుకలవాడును, సుఖియుసుందర మైన ముఖముగలవాడును, స్త్రీలతో విరోధముగానుండువాడును, విద్యావినయసంపన్నుడును అగును.

తృతీయేశుక్రః:—భ్రాతృవృద్ధిః దాక్షిణ్యవాక్, దృఢగాత్రః, కించిల్లుబ్ధః.

తృతీయమున శుక్రుడున్న ఎక్కువమంది సోదరులుగలవాడును, దయగలవాడును, దృఢమైనవాడును, కొద్దిగా లోభగుణములుగలవాడును అగును.

చతుర్థేశుక్రః:—భోజనవాన్, బుద్ధిమాన్, మాతృసౌఖ్యః గోసంరక్షణాదివృద్ధిః, క్షీరసమృద్ధి, అశ్వాదివాహనభాగ్యవాన్.

చతుర్థమున శుక్రుడున్న మంచిభోజనముచేయువాడును, బుద్ధిమంతుఁడు, తల్లిచే లాలింపబడినవాడును, గోరక్షణసేయువాడును, పాలు సమృద్ధిగాగలవాడును, వాహనయోగముగలవాడును, పండితుఁడును, బంధువులకు యిష్టుడును, ధనధాన్యములుగలవాడును అగును.

పంచమేశుక్రః:—బుద్ధిమాన్, మంత్రిత్వమతిః. మాతారిష్టం, సేనాధిపతిర్భవతి, భూపః, పుత్రవాన్, విద్యావాన్.

పంచమమున శుక్రుడున్న బుద్ధిమంతుడును మంత్రాంగమునకు దగినవాడును, తల్లికరిష్టము కలుగజేయువాడును, సేనాధిపతియు, భూపాలుఁడు, సంతానయుతుఁడును, విద్యాయుతుడును అగును.

షష్ఠేశుక్రః:—శత్రుక్షయః, జ్ఞాతిబహుళః పౌత్రదర్శనః, పరస్త్రీసంభోగః, స్త్రీవ్యాధిః.

ఆరింటశుక్రుడున్న శత్రుక్షయమును, జ్ఞాతివృద్ధియు, మనుమని చూచుటయు, పరస్త్రీగమనమును, సుఖవ్యాధులు గలవాడు నగును.

సప్తమేశుక్రః :—అతికాముకః, భగచుంబకః, అకృతవాన్, పరదారరతః, విభవసంపన్నః, శనియుతశ్చేత్ వ్యభిచారీ.

ఏడింట శుక్రుడున్న నతికాముకుడును, భగచుంబనము చేయువాడును, అకార్యములు చేయువాడును, పరస్త్రీసంగమము చేయువాడును, విభవముకలవాడునుఅగును. శనితోకలసియున్న వ్యభిచారియగును.

అష్టమేశుక్రః :—సుఖీ, మాతృగండః, అల్పాయుః, ప్రసిద్ధః, దుర్మార్గః, ఆయుఃపర్యంతమైశ్వర్యం, తపస్వీ.

ఎనిమిదవయింట శుక్రుడున్న సుఖియు, మాతృగండము గలవాడును, అల్పాయువు కలవాడును, ప్రసిద్ధుడును, దుర్మార్గుడును, బ్రతికినన్నాళ్ళును ఐశ్వర్యముగలవాడును అగును.

నవమేశుక్రః :— అనుష్టానపరః, పదాతిసంరక్షకవాన్, గురువిశ్వాసవాన్, స్వకార్యపరః.

తొమ్మిదింట శుక్రుడున్న అనుష్టానపరుడును, సైనికుల రక్షించువాడును, గురువిశ్వాసముగలవాడు, స్వకార్యముల చక్కగా చేసికొనువాడును అగును.

దశమేశుక్రః :—పితృదేవభక్తః, విద్యావిఘ్నః, జ్యేష్ఠాభావః, వాహనభాగ్యవాన్.

పదింట శుక్రుడున్న దేవతలయందును, తండ్రియందును భక్తికలవాడును, విద్యకు విఘ్నముగల్గినవాడును, సోదరులులేనివాడును, వాహనభాగ్యముగలవాడును అగును.

ఏకాదశేశుక్రః :—విద్వాన్, బహుధనవాన్, భూలాభవాన్, ఆందోళాదిప్రాప్తిః.

ఏకాదశమున శుక్రుడున్న విద్వాంసుడును, ధనవంతుడును, భూలాభముగలవాడును, పల్లకిమున్నగువాని నెక్కువాడును అగును.

ద్వాదశేశుక్రః—విషయపరః లుబ్ధః, సర్వైశ్వర్యవాన్.

పండ్రెండింట శుక్రుడున్న విషయపరుడును, లుబ్ధుడును, ఐశ్వర్య వంతుడును అగును.

లగ్నాదిశనిఫలం.

లగ్నేశనిః—పుత్రఘ్న, దుర్బుద్ధిః, దుర్విచారః రాజకోపః, దుర్మార్గిణీ,వాతపీడితదేహః ఉచ్చస్థేసతి ఉరుబలగ్రామాధికారీ, విద్వాన్, మలినః, కామాతురః, రోగీ, కురూపవాన్

తనుస్థానమున శనియున్న పుత్రులకరిష్టముచేయువాడును, దుర్బుద్ధియు, దుర్విచారుడును, రాజద్వేషియు, దుర్మార్గుడును, వాతదేహుడును అగును, శనియుచ్ఛయందున్న గ్రామాధికారియు, విద్వాంసుడును, మలినుడును, కామాతురుండును, రోగియు, కురూపియునగును.

ద్వితీయేశని:—ద్రవ్యాభావః, దారద్వయం, అల్పక్షేత్రం, ముఖరోగీ నేత్రదుర్బలః, విద్యావిఘ్నః, పాపయుతే నిశ్చయంభవతి.

ద్వితీయమున శనియున్న ధనహీనుడును, ఇద్దరుభార్యలుగలవాడును, కొద్దిపాటి భూమిగలవాడును, ముఖరోగియు, కంటిజబ్బుగలవాడును, విఘ్నమైనవిద్యగలవాడును, అందునను పాపులతోగలసియున్న తప్పక విఘ్నమైనవాడును అగును.

తృతీయేశనిః—భ్రాతృహానిః, సంపన్నః, అతిదుష్టః, దాసీభృత్యసంగ్రహవాన్, సాహసీ, ధనధాన్యవాన్ కృషిపరః.

మూడింట శనియున్న సోదరులకు హానిచేయువాడును, సంపన్నుడును, అతిదుష్టుడును, దాసీలు పరిచారకులు గలవాడును, సాహసియు ధనధాన్యములు గలవాడును, కృషికుడును అగును.

చతుర్థేశనిః :—మాతృహంతా, ద్విమాతృత్వం, సూతిరోగీ సౌఖ్యహానిః, మహతాపత్యం, తిలమాషసస్యప్రియః, రాజపీడితః, పూర్వధనభూమిపరిత్యాగః, భారవాహి.

నాల్గవయింట శనియున్న తల్లిగండమును, యిద్దరుతల్లులుకలవాడును, శూలరోగియు, సౌఖ్యములేనివాడును, కపటహృదయముగలవాడును, నువ్వుపప్పుతో జేయబడినవాని నెక్కువతినువాడును, రాజదండనము పొందినవాడును, పిత్రార్జితము పోగొట్టుకొనువాడును, బరువుల మోయువాడును అగును.

పంచమేశనిః:—పుత్రవిఘ్నః, దుర్బుద్ధిః, దుర్విచారః, రాజకోపః, దుర్గామిణీ, పుత్రస్థానే ద్విగ్రహాయుతేనతిదత్తపుత్రవాన్.

పంచమమున శనియున్న పుత్రులకరిష్టము గలుగజేయువాడును దుర్బుద్ధిగలవాడును, దుర్విచారుడును, రాజకోపమునకు పాత్రుడును, దుర్మార్గుడును, శని రెండుగ్రహములతో కలసియున్న దత్తపుత్రుడుకలవాడును అగును.

షష్ఠేశనిః:—అల్పజాతిః బధిరః, మూర్ఖః, పితృక్షయః, ధనధాన్యవృద్ధిః, అల్పపుత్రః జ్ఞాతిహీనః, కలహీ.

ఆరింట శనియున్న కొద్దిమంది జ్ఞాతులుగలవాడును, చెవిటివాడును, మూర్ఖుడును, తండ్రికనిష్టప్రదుడును, ధనధాన్యములుగలవాడును, కొద్దిమంది పుత్రులుగలవాడును, జ్ఞాతిహీనుడును జగడాలమారియునగును.

సప్తమేశనిః:—శరీరదోషః, కళత్రద్వయం, వేశ్యాసంభోగం, దేశాంతరసంచారః, అన్యగృహరక్షకః, దారహానిః, బహుదారత్వం వంచకః, నాభీరోగః, బధిరః, అధకర్ణరోగః.

ఏడింట శనియున్న దోషశరీరుడును, యిద్దరుభార్యలు గలవాడును, వేశ్యాప్రియుడును, దేశసంచారము సేయువాడును, ఇతరులగృహమును రక్షించువాడును, భార్యకరిష్టము కలిగించువాడును, ఎక్కువమంది భార్యలుకలవాడును, వంచకుడును, నాభియందు రోగముగలవాడును, బధిరుడును, లేదా కర్ణరోగము గలవాడును అగును.

అష్టమేశనిః—త్రిపాదయుతవాన్, బృహన్నాభిః, అతిదారిద్ర్యః, శూద్రస్త్రీసంగమః, సేవకావృత్తిః, అల్పపుత్రః, కించిన్నేత్రరోగీ కుష్ఠదేహః, గ్రంధిరోగః, పరదారరతః, శుక్రయుతే గ్రామాంతరసంచారః, కుజయుతే జలగండః, రాహుయుతేకర్మవిచ్ఛిత్తిః, పితృకర్మహీనః, జారవిచారః, శ్వాసకాలాదిరక్తమూలరోగీ, మధ్యేమధ్యే కించిచ్ఛరీరాయాసః, యాత్రావిఘాతః, అనుజహీనః, కళత్రవర్గే అపవాదః, అన్యాయార్జితధనపరః, అవివేకపుత్రలబ్ధవాన్, అంగహీనః, పూర్ణాయుః :—

అష్టమమున శనియున్న కుంటివాడును, పెద్దబొడ్డుగలవాడు, దరిద్రుడును, శూద్రస్త్రీతో రమించువాడును, సేవకుడును, కొద్దిమందిపుత్రులుగలవాడును, అన్యస్త్రీరతుడును, నేత్రరోగియు, కుష్ఠురోగము. గ్రంధిరోగముగలవాడును, శుక్రునితోకలసియున్న గ్రామాంతరసంచారమును, కుజునితోఁ గలసియున్న జలగండమును, రాహువుతోఁ గలసిన కర్మహీనుడును, జారుడును, శ్వాసకాసాదిరక్తమూలరోగములు గలవాడును, మధ్యమధ్య శరీరమునకు జబ్బుచేయునట్టివాడును, యాత్రలవిఘాతముచేయువాడును, తమ్ములులేనివాడును, కళత్రవర్గమున నపవాదుగలవాడును, అన్యాయముగా ధనమార్జించువాడును, అవివేకులైన పుత్రులుగలవాడును, అంగహీనుడును, పూర్ణాయువుగలవాడును అగును.

నవమేశనిః—అతిలుబ్ధః, జీర్ణవస్త్రధారీ, గోపురతటాకాదిప్రతిష్ఠాసిద్ధిః, పితృవర్గేస్త్రీహానిః, పితృసర్వజనవిరోధః.

తొమ్మిదింటశనియున్న అతిలోభియు, చిరుగుబట్టలుకట్టువాడును, గోపురాదులప్రతిష్టించువాడును, తండ్రిసంబంధీకులైనస్త్రీల కరిష్టముకల్గించువాడును, తండ్రిసంబంధులతో విరోధించువాడును అగును.

దశమేశనిః—గంగాస్నానవాన్, లుబ్ధః, కృషిపరః, పిత్తశరీరః గ్రామాధికర్తా, జన్మభూమిపరిత్యాగః, దూరదేశజీవనోపాయః.

పదింటశనియున్న గంగాస్నానముచేయువాడును, కృషికుడును, పైత్యశరీరుడును, గ్రామాధికారియు, జన్మభూమిని విడుచువాడును, దూరదేశమున జీవనోపాయముగలవాడును అగును.

ఏకాదశేశనిః:—బహుధనవాన్, భూలాభః, రాజపూజ్యః, విద్యావిఘ్నః, జ్యేష్ఠపితృ, జ్యేష్ఠభ్రాతృభావః, వాహనభాగ్యవాన్

పదునొకండింట శనియున్న ధనికుడును, భూలాభముగలవాడును రాజపూజితుడును, చదువునకు విఘ్నముగల్గినవాడును, పెద్దతండ్రి, అగ్రసోదరులులేనివాడును, వాహనభాగ్యముగలవాడును అగును.

ద్వాదశేశనిః:—పండితః, వికలాంగః, పాపయుతే నేత్రోచ్చాటనః, శుభయుతేశుభంభవతి, సర్వకార్యపరం, విషమాక్షః, పాపక్షేత్రే పాపయుతే పాపయోగవిచ్ఛిత్తిర్భవతి.

ద్వాదశమునశనియున్న పండితుడును, వికలాంగుడును, పాపులతో గలసియున్న నేత్రరోగియు, శుభులతోగలసియున్న శుభముగల్గించువాడును, అన్నికార్యములను చేయువాడును, సమానముగాలేని కన్నులు గలవాడును అగును. పాపక్షేత్రముల పాపులతో గలసియున్న యెడల పాపయోగమునకు భంగముకలుగును.

---

## —♦ లగ్నాదిరాహుఫలః ♦—

లగ్నేరాహుః:—పుత్రాభావః, మృతప్రసూతిః, మేషవృషభమిథునకర్కాటకసింహకన్యామకరేషురాహుస్థితశ్చేత్ రాజయోగః, మహాభోగీ, దయాళుః.

లగ్నమున రాహువుపుసంతానములేనివాడును, మేషవృషభమిథునకర్కాటకసింహకన్యామకరములు లగ్నములుకాగా వానియందున్నరాహువు రాజయోగకర్తయు, భోగియు, దయాళుడును అగును.

ద్వితీయేరాహుః:—దేహవృద్ధిః, నిర్ధనత్వం, పుత్రశోకః, దారద్వయం, శ్యామలవర్ణం, వికటనేత్రం, ముఖరోగీ.

రెండింట రాహువున్న శరీరవృద్ధిగలవాడును, దరిద్రుడును,పుత్రశోకముగలవాడును, యిరువురుభార్యలుండువాడును, శ్యామలవర్ణముగలవాడును, వికటనేత్రములుగలవాడును ముఖరోగియు నగును.

తృతీయేరాహుః:—ఐశ్వర్యం, లక్షాధికారీ, అల్పపుత్ర, ధైర్యవాన్, భాతృసౌఖ్యం, ప్రతాపీ, గోత్రసమృద్ధిః, కర్ణరోగీ.

తృతీయమున రాహువున్న నైశ్వర్యమును, లక్షాధికారియును కొద్దిమందిపుత్రులుగలవాడును, ధైర్యముగలవాడును, సోదరులుగలవాడును, ప్రతాపవంతుడును, గోత్రసమృద్ధిగలవాడును కర్ణరోగియునగును.

చతుర్థేరాహుః:—బహుభూషణసమృద్ధిః, పత్నీద్వయం, సేవకావృత్తిః, మాతృద్వయం భవతి.

చతుర్థమందు రాహువున్న భూషణసమృద్ధిగలవాడును, ఇద్దరుభార్యలుగలవాడును, ఇద్దరుతల్లులు గలవాడును, సేవకుడును అగును.

పంచమేరాహుః :— పుత్రవిఘ్నః జన్మాంతరే సర్పశాపపరః విష్ణుప్రసాదేనపుత్రోత్పత్తిః, పవనవ్యాధిః, దుర్మార్గః రాజకోపపరః, దుర్గామణీ.

పంచమమున రాహువున్న పుత్రులకరిష్టముగల్గించువాడును, జన్మాంతరమున సర్పశాపముబడిసినవాడును, విష్ణుప్రసాదమున కుమారులుగలవాడును, పవనవ్యాధిగలవాడును, దుర్మార్గుడును, రాజకోపమునకు పాత్రుడును అగును.

షష్ఠేరాహుః :—స్త్రీనాశనః, శత్రుఘాతకః, బహుధనవాన్ అతీతసౌఖ్యం, బహుజ్ఞాతిః.

ఆరింటరాహువున్న స్త్రీనాశనకరుడును, శత్రువుల నశింపసేయు వాడును, ఎక్కువధనవంతుడును, ఎక్కువసౌఖ్యముగలవాడును, జ్ఞాతి వృద్ధిగలవాడును అగును.

సప్తమేరాహుః :—దారాద్వయంభవతి, ప్రథమభార్యాయాఃకుసుమవ్యాధిః,ద్వితీయభార్యాయాః గుల్మవ్యాధిః, విధవాసంగమః మూత్రరోగీ.

ఏడింటరాహువున్న యిద్దరుభార్యలుందురు. మొదటిభార్య కుసుమరోగియు, రెండవభార్య గుల్మరోగియుఅగును. విధవాగమనము చేయువాడును, మూత్రరోగియు అగును.

అష్టమేరాహుః :—కలహీ, పతితత్వం ద్వాత్రింశద్వర్షేగండకాలః శుభయుతేపంచాశద్వర్షేగండః.

అష్టమమున రాహువున్న కలహించువాడును, పతితుడును, ముప్పదిరెండవవత్సరమున గండముగలవాడును, శుభులతోగూడియున్న 50 వత్సరమున గండముగలవాడును అగును.

నవమేరాహుః :—స్త్రీవశ్యః, పుత్రవర్జం, శూద్రసంప్రదాయః సేవకావృత్తిః, ధర్మలేశోనాస్తి.

నవమందు రాహువున్న స్త్రీవశ్యముగలవాడును, పుత్రులచే విడువబడినవాడును, శూద్రసంపర్కముగలవాడును, సేవకుడును ధరత లేశములేనివాడును అగును.

దశమేరాహుః :—సర్వైశ్వర్యం, వితంతుసంగమీ, కావ్యనాటకాలంకారాదివిద్వాన్, దూరయాత్రాసత్కర్మవిఘ్నః, పవనవ్యాధిః.

పదింటరాహువున్న ఎక్కువైశ్వర్యముగలవాడును, విధవాసంగమముచేయువాడును, కావ్యనాటకాదుల చదివినవాడును, దూరయాత్రాదికములకు విఘ్నముసేయువాడును, పవనవ్యాధిగలవాడును అగును.

ఏకాదశేరాహుః :—ధనధాన్యసమృద్ధిః, పుత్రసమృద్ధిః, మ్లేచ్ఛ ప్రభుపూజ్యః.

పదకొండింట రాహువున్న ధనధాన్యసంపదయు, పుత్రవృద్ధియు మ్లేచ్ఛులచే పూజింపబడుటయు గలుగును.

ద్వాదశేరాహుః :—లుబ్ధః, వ్యయకరః, అల్పపుత్రః, నేత్రరోగీ.

పండ్రెండింట రాహువున్న లుబ్ధుడును, వ్యయముసేయువాడును కొద్దిమంది పుత్రులుగలవాడును, నేత్రరోగియు నగును.

## ల గ్నా ది కే తు ఫ ల ం.

లగ్నే కేతుః :—హస్తస్వేదః, కటిరోగీ, కృశదేహి, బలహీనః, సౌజన్యహీనః, విషరోగః.

లగ్నమున కేతువున్న చేతులకు చెమటపట్టువాడును, కటిరోగియు సన్నని దేహముగలవాడును, బలహీనుడును, సౌజన్యత లేనివాడును, విష రోగపీడితుడును అగును.

ద్వితీయే కేతుః :—సంభ్రమవచనః, దుష్టవాన్.

ద్వితీయమున కేతువున్న ఆశ్చర్యముతో బలుకువాడును దుష్టు డును అగును.

తృతీయే కేతుః :—లోకప్రియః, బలవాన్, బంధుసహితః, కనిష్ట భ్రాతృసుఖహీనః, పత్రశాకప్రియః.

తృతీయమున కేతువున్న లోకమునకు యిష్టుడును, బలవంతుడును, బంధుసహితుడును, తమ్ములను సౌఖ్యములేనివాడును, ఆకుకూరలయం దిష్టతగలవాడును అగును.

చతుర్థే కేతుః :—విషరోగః, కలహప్రియః, బలహీనః, మాతృ రోగః.

నాలుగింట కేతువున్న విషరోగియు, కలహప్రియుడును బల హీనుఁడు, తల్లికి రోగముకల్గించువాడును అగును.

పంచమ కేతుః :—మృగశిరః, ఉదారః, పాపభీతిః, ఆదౌపుత్రికా లాభః, పుత్రవిఘ్నః, శుభవీక్షణత్వాత్ కాలవిళంబత్వేనపుత్రోత్పత్తిః.

పంచమమున కేతువున్న మృదువైన శిరస్సుగలవాడును, ఉదా రుడును, పాపభీతిగలవాడును, ముందుగా కుమార్తెలుగలవాడును, పుత్రుల కరిష్టము గలిగించువాడును, శుభులు చూచుచున్న చాలకా ౦మునకు పుత్రులుపుట్టువాడును అగును.

షష్ఠేరాహుః :—అనుకూలశత్రుః, కులశ్రేష్ఠః, సంభ్రమవచనః స్త్రీప్రియః.

ఆరింటరాహువున్న కులశ్రేష్ఠుడును, ఆశ్చర్యముగా మాట్లాడు వాడును, స్త్రీలకు యిష్టుఁడును అగును.

సప్తమే కేతుః :—దాసీభోగః, కామాతురః, దారపీడా, విధవా సంభోగః, గూఢకర్మరతః.

ఏడింట శుక్రుడున్న దాసీలతో భోగించువాడును, కామాతురు డును, భార్యకరిష్టము గల్గించువాడును, విధవాసంగముచేయువాడును, గూఢకర్మలజేయువాడును అగును.

అష్టమే కేతుః :—ఉత్సాహవాన్, బుద్ధిహీనః, నయనరోగః, పుత్రవిఘ్నః, స్త్రీనాశః, అకారణేనజనవిరోధః.

అష్టమమున కేతువున్న నుత్సాహవంతుఁడును, బుద్ధిహీనుఁడును నేత్రరోగియు, పుత్రులకరిష్టము చేయువాఁడును, స్త్రీలకు నాశనకరుఁడును, జనవిరోధియు నగును.

నవమే కేతుః :—దృష్టివిహీనః, పాపమతిః, అనృతవాన్, పుత్ర మిత్రకళత్ర మనోబలవాన్.

తొమ్మిదింట కేతువున్న నేత్రరోగియు, పాపబుద్ధిగలవాఁడును, కల్లలాడువాఁడును, పుత్రులు మిత్రులు భార్యమున్నగు వారిబలగము గలవాఁడును అగును.

దశమే కేతుః :—ఉత్సాహవాన్, భోగవాన్, మంత్రోపాసకః.

పదింట కేతువున్న ఉత్సాహియు, భోగియు, మ త్రోపాసకుఁడును అగును.

ఏకాదశే కేతుః :—లోకప్రియః, హాస్యప్రియః, దుశ్శీ‥ః, బహు కళావాన్, దుర్బంధుః.

పదకొండింట కేతువున్న లోకప్రియుఁడును, హాస్యముగామాట్లాడు వాఁడును, దుశ్శీలుఁడును, అనేకకళలు నేర్చినవాఁడును, చెడ్డబంధువులు గలవాఁడును అగును.

ద్వాదశే కేతుః :—చలచిత్తః, నయనరోగః, విదేశవాసః, అపాత్రే ప్రియకరః, దేశాంతరసంచారః, జన్మభూమిపరిత్యాగః, మోక్షవాన్ భవతిః

పండ్రెండింట కేతువున్న చంచలుఁడును, నేత్రరోగియు విదేశ వాసుఁడును, అపాత్రులకై ధనమును ఖర్చుపెట్టువాఁడును, జన్మభూమి విడచువాఁడును, మోక్షమునొందువాఁడును అగును.

స ం పూ ర్ణ ము.



# పూర్వకవుల పద్యకావ్యములు.

| | రు | అ |
|---|---|---|
| రంగనాధరామాయణము | 2 | 0 |
| వసుచరిత్రమూలము | 0 | 12 |
| ,, తాత్పర్యసహితము | 1 | 8 |
| ,, టీకాతాత్పర్య సహితము క్యాలికో | 4 | 0 |
| విజయవిలాసము | 0 | 8 |
| రాజశేఖరవిలాసము | 0 | 8 |
| వైజయంతీవిలాసము | 0 | 8 |
| శశిరేఖాపరిణయము | 0 | 8 |
| శశాంకవిజయము | 0 | 12 |
| శృంగారనైషధము | 0 | 12 |
| పాండురంగమహాత్మ్యము | 1 | 0 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | 0 | 12 |
| శతకరత్నావళి బైండు | 2 | 0 |
| శతకరత్నములు 1 భా॥ | 0 | 8 |
| ,, 2 భా॥ | 0 | 8 |
| పోతనరత్నములు | 0 | 12 |
| బాలవితంతువిలాపము | 0 | 5 |
| సారంగధరచరిత్ర | 0 | 8 |
| పారిజాతాపహరణము | 0 | 8 |
| మొల్లరామాయణము | 0 | 8 |
| వేంకటాచలమహాత్మ్యము | 0 | 10 |
| భక్తచింతామణి వ. సు. | 0 | 5 |
| కళాపూర్ణోదయము | 0 | 12 |
| ,, నాణ్యముక్యాలికోబైండు | 2 | 4 |

| | రు | అ |
|---|---|---|
| బిల్హణీయము | 0 | 8 |
| శృంగారశాకుంతల | 0 | 8 |
| రసికజనమనోభిరామము | 0 | 8 |
| శతకంఠ రామాయణము | 0 | 12 |
| పట్టాభిరామాయణము | 0 | 6 |
| భాగవతముసప్తమస్కంధము ప్రహ్లాదచరిత్ర | 0 | 6 |
| ,, టీకాతాత్పర్యసహితం | 1 | 0 |
| ,, క్యాలికోబైండు | 1 | 4 |
| భర్తృహరిసుభాషితము | 0 | 8 |
| ,, నాణ్యము క్యాలికో | 2 | 0 |
| జైమినీభారతము | 0 | 12 |
| కుచేలోపాఖ్యానము (గట్టుప్రభువు) | 0 | 6 |
| నలోపాఖ్యానము టీకా | 0 | 6 |
| పంచతంత్రము | 0 | 8 |
| నీతిచంద్రిక | 0 | 6 |
| వేమనపద్యములు | 0 | 8 |
| ,, పెద్దదిక్యాలికో | 2 | 0 |
| ,, తాత్పర్యసహితము | 3 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము | 0 | 12 |
| రామకర్ణామృతము | 0 | 8 |
| ,, మేలుప్రతి | 1 | 8 |
| కృష్ణకర్ణామృతము | 0 | 8 |
| ,, మేలుప్రతి | 1 | 8 |

శ్రీ సత్యనారాయణబుక్ డిపో, రాజమండ్రి.

# వైద్యగ్రంథములు

| | రు. | అ. | | రు. | అ. |
|---|---|---|---|---|---|
| శార్ఙ్గసంహిత | 3 | 0 | వైరాగిచిటికలు పెద్దది | 0 | 8 |
| వస్తుగుణదీపిక యో॥సు॥గారు | 5 | 0 | నాడీపరిజ్ఞానం | 0 | 8 |
| సర్వమూలికాయోగమం | 5 | 0 | నలభీమపాకశాస్త్రం | 0 | 12 |
| తిబ్బెలక్బరుషాహిఅను | | | మిలటరీపాకశాస్త్రం | 0 | 12 |
| యూనానీగ్రంథము | 6 | 0 | వస్తుగుణప్రదర్శిని 300 పే॥ | 1 | 0 |
| చరకసంహిత శ్రీ॥ కృ॥ | 6 | 0 | ధన్వంతరివిజయం | 0 | 10 |
| అనుభవదీపిక డిటో | 1 | 0 | స్త్రీజనకల్పతరువు | 1 | 0 |
| భస్మప్రకాశిక డిటో | 1 | 0 | దంతవైద్యం | 0 | 8 |
| ఆంధ్రభైషజ్య | | | అశ్వలక్షణసారం | 0 | 8 |
| రత్నావళి శ్రీ॥ కృ॥ | 2 | 0 | పర్వత్తుపాకావళి | 0 | 8 |
| బసవరాజీయము | 7 | 0 | చికత్సారత్నం శ్లో॥ | 0 | 12 |
| ఆంగ్లేయౌషధగుణదీపిక | 4 | 0 | వైద్యరహస్య | | |
| సిద్ధమూలికారహస్యం | 1 | 0 | చింతామణి 1 వ భా॥ | 0 | 12 |
| పులిప్పాణివైద్యం | 1 | 8 | డిటో 2 వ భా॥ | 0 | 12 |
| యూనానీవైద్యామృతం | 0 | 8 | శతలేహ్యపాకావళి | 0 | 8 |
| కుసుమరోగనివారిణి | 0 | 12 | నేత్రదర్పణం | 0 | 8 |
| గృహవైద్యము 1 భాగం | 0 | 12 | బాలగ్రహచికిత్సలు | 0 | 4 |
| డిటో 2 భాగము | 0 | 12 | డిటో చిన్నసైజు | 0 | 1 |
| ఆయుర్వేదవైద్యామృతం | 0 | 12 | అనుపానమంజరి | 0 | 8 |
| సుఖరోగచికిత్సలు | 0 | 8 | సహదేవశుశ్రూష్యం | 0 | 6 |
| విషవైద్యము | 0 | 8 | వ్రణచికిత్సలు | 0 | 8 |
| రసప్రదీపిక | 0 | 10 | భస్మప్రదీపిక | 0 | 12 |

కొండపల్లి వీరవెంకయ్య అండు సన్సు, రాజమండ్రి.